# వాల్తేరా

నోరి నరసింహశాస్త్రి




వెల 1-10



నోరి వారు : రేపల్లె

Approved by the Andhra T. B. C. Vide Andhra Pra. Gaz. Dated 3—1—57 - Page 9.

Prescribed by the Ad Hoc Committee, Non-det. study for Class X Andhra Univ. Area 1960 - 61.

# వాఘిరా

( అజంతా నవల )

నోరి నరసింహశాస్త్రి



. నోరివారు : రేపల్లె .

. గుంటూరు జిల్లా .

రు. 1=10 న. పై.

|

# జాతీయ గీతము

జన గణ మన అధినాయక జయ హే
భారత భాగ్య విధాతా.
పంజాబ సింధు గుజరాత మరాఠా
    ద్రావిడ ఉత్కల వంగ
వింధ్య హిమాచల యమునా గంగా
    ఉచ్ఛల జలధి తరంగా
తవ శుభ నామే జాగే
తవ శుభ ఆశిష మాగే
గాహే తవ జయ గాథా.
    జన గణ మంగల దాయక, జయ హే
భారత భాగ్య విధాతా
    జయ హే, జయ హే, జయ హే,
జయ జయ జయ, జయ హే.

# పరిచయము

అజంతా గుహలనుగూర్చి యెన్నియో గ్రంథములు వ్యాసములు వెలువడినవి. అందలి చిత్రములు విరివిగా ప్రకటింపఁబడినవి. ఐనను అవి యన్నియుఁ బ్రత్యేకశ్రద్ధతోఁ జదువువారికే గాని సామాన్యుల కందుబాటులో లేవు. పాఠ్యగ్రంథములలో వానినిగూర్చిన పాఠములు తఱచుగాఁ జేర్పుచున్నను, పాఠకులకును, విద్యార్థులకును ఆ గుహలు భిక్షువులకు తపోనిలయములై జనములతోఁ గలకలలాడుచుండి సజీవములుగా నున్న నాటి స్థితి హృదయమున హత్తుకొను నట్లు చేయుటకు సమర్థములు కాకున్నవి. ఆ కొఱత తీర్చు నుద్దేశముతో ఈ నవల రచించితిని.

అజంతా గుహలలోని చిత్రముల సంగతియే పలువు రెఱుఁగుదురు కాని అందులోని శిల్పనైపుణ్యము మందిరనిర్మాణవైభవము తెలిసినవా రరుదు. ఆ ప్రదేశము చూచినవారికే గాని అచ్చటి ప్రకృతిసౌందర్య మవగాహనము గాదు. ఆ తావు బహుకాల మజ్ఞాతముగా నుండి కొలదికాలము క్రిందటి వఱకు చేరుటకు ప్రయాణసౌకర్యములు లేని దగుటచే నది మనుష్య నివాసముల కందుబాటులో లేని చోట నెక్కడనో దూరముగా నడవిలో కొండలలో నున్నదను భావము సర్వసామాన్యముగా వ్యాపించి యున్నది. కాని యది వాస్తవము కాదు. ఉత్తరభారతమునుండి దక్షిణాపథమునఁ బశ్చిమభాగమునకు వింధ్యపర్వతశ్రేణి దాటి వచ్చుటకు అనాదిగా నుపయోగపడుచున్న రాజమార్గమునకు సమీపమున సరిగా నీ యజంతాగుహారామము లున్నవి. అవ్వి భిక్షువులకును భక్తులకును రాకపోకల కనువుగా నుండియు, తపస్వుల కట్టి ధ్యానభంగము కాకుండునట్టి యేకాంతరమ్యస్థానమున నిర్మింపఁ బడినవి. ఆ గుహలలో కొన్ని వందలమంది భిక్షువు లుండుటకు వీలున్నది. అవి భిక్షువులతో నిండియున్నపుడు, ఇపుడు కానరాకున్న భవనాదు లింకెన్ని యుండెడివో మన మూహింపవలసినదే కాని వాని చిహ్నము లిప్పు డగపడవు.

ఇప్పు డక్కడ 29 గుహ లున్నవి. గుర్తించుట కొఱకై ఆర్కియాలజీశాఖవారు వానిని తూర్పునుండి పడమటికి అవి యున్న వరుసలో నంకెలు వేసినారు. ఆ గుహలున్న పర్వతము గుఱ్ఱపునాడము ఆకారమున నున్నది. ఆ గుహలలో నెల్ల 1, 2, 16, 17 గుహలు చిత్రకళాదులం దుత్తమమైన వని విజ్ఞుల యభిప్రాయము. కొండవంపులో మధ్యభాగమున నున్న 16, 17 గుహలు క్రీస్తుశకము 6 వ శతాబ్దము చివరిభాగమునను, తూర్పుచివర నున్న 1, 2 గుహలు 7వ శతాబ్దము మొదటిభాగమునను దొలువఁబడిన వని పలువురు పండితుల సిద్ధాంతము. చిత్రకళ యుచ్చదశకు వచ్చిన కాలముననే యవి యేదో ప్రమాదమునకు గుఱియై నిర్మానుష్య మైనవి. భారతీయ శిల్పము చిత్రకళ అద్వితీయ స్థాయి నందుకొన్న సమయముననే అవి యాకస్మిక ముగా నంతరించిన విషాదఘట్ట మీనవలలో చిత్రించుటకు యత్నించితిని.

ఆకాల మెన్నో విధముల భారతదేశ చరిత్రలో స్మరింపఁదగిన కాలము. ఈ గుహారామము లున్న కుంతలదేశము నప్పుడు సత్యాశ్రయ పులకేశి వల్లభుఁడు వాతాపి నగరము రాజధానిగాఁ బాలించుచుండెను. ఆ పశ్చిమ చాళుక్యప్రభువు పల్లవమహేంద్రవర్మ నోడించి వేంగిరాజ్యమునఁ దన తమ్ముడును తూర్పు చాళుక్యులని నేడు పిలువఁబడుచున్న రాజుల వంశ కర్తయు నగు కుబ్జవిష్ణువర్ధనుని రాజప్రతినిధిగా నుంచెను.

తన సోదరుఁడు హూణులను భరతభూమినుండి పారఁద్రోలి చనిపోఁగా, శ్రీహర్షవర్ధనుఁడు ఉత్తరభారతము చాలవరకు నేకచ్ఛత్రాధిపత్యము క్రిందికిఁ దెచ్చెను. అతఁడు యోద్ధయే కాక ప్రియదర్శిక, రత్నావళి, నాగానందము అను ప్రసిద్ధనాటకములు రచించిన కవి; హర్ష చరిత్రము కాదంబరి రచించిన బాణభట్టును, మయూరాది కవులను సమ్మానించి పోషించిన సహృదయుఁడు. ఆ చక్రవర్తి దక్షిణ దిగ్విజయయాత్రకై నర్మదానది దాట నుంకింప, పులకేశి యాతని నరికట్టి జయించి దక్షిణాపథపరమేశ్వరుఁ డను బిరుదము వహించెను.

ఆ తరువాత కొలదికాలముననే పులకేశి శత్రువగు మహేంద్రవర్మ కుమారుఁడు నరసింహవర్మ పులకేశిని యుద్ధములో నిహతునిఁ గావించి

వాతాపి తగులఁ బెట్టెను. మామల్లపురములోని ప్రసిద్ధ శిల్పములును ఆనాటివే. జగత్ప్రసిద్ధుఁడగు చీనాయాత్రికుఁడు హ్యూయనుత్సాంగు భారత దేశమునఁ బర్యటించిన కాల మదియే.

ఇది చరిత్రాత్మక మగు నవలగా నుద్దేశింపకపోయినను రచనలో చరిత్ర విస్మరింపలేదు. ఇందలి పాత్రలలో పులకేశి, కుబ్జవిష్ణువర్ధనుఁడు, శ్రీహర్ష వర్ధనుఁడు, అతని దూత మేఖలకుఁడు చారిత్రక పురుషులు. తక్కిన పాత్ర లన్నియుఁ గల్పితములు. నర్మదానదీతీరమున హర్షవర్ధనునితో పులకేశి చేసిన సంగ్రామము కథలో నల్లుకొనిపోయినది.

ప్రస్తుతము మొదటి గుహయని పిలువఁబడుచున్నది తూర్పు చివర నున్నది. ఈ కథ ప్రారంభించునాటి కది నిర్మాణ మవుచున్నట్లును, కథా నాయకుని తండ్రి యశోకుఁడు దాని ప్రధాన శిల్పియనియుఁ గల్పింపఁ బడినది. రెండవగుహ యనునది కథాంతమునఁ గథా నాయకుఁడగు కొండప నిర్మించినట్లు వర్ణింపఁబడినది. అధ్యక్షుఁడగు కుమారశ్రీనాథుఁడు తపస్సు చేసికొనునది 16 వ గుహ యనియు, అశోకుని గురువు తపస్సుచేసికొను చున్నది 17 వ గుహయనియు, అవి మధ్యలో నున్నట్లు వర్ణింపఁబడినందున తద్విదులు గుర్తింపఁ గలరు. ఈ గుహారామము లన్నియుఁ బరీక్షించుటకు కుబ్జవిష్ణువర్ధనుఁడు తన పటకుటీరము నిర్మించుకొన్న ప్రదేశము ఆవలికొండ మీద View Point అని ప్రసిద్ధిగన్న ప్రదేశము. ఈ గుహల యునికి ముందా ప్రదేశమునుండియే సైనికాధికారులు గుర్తించిన దగుటచే, నేటి సేనాధి పతులకును నాటి సేనాధిపతులకును సామరస్యము కూర్పఁబడినది. మొదటి రెండు గుహలలో 'నల్లరాణి' యని ప్రసిద్ధికెక్కిన చిత్రములును, రెండవ గుహలో ఖడ్గమెత్తి చంపఁబోవుచున్న రాజుకాళ్ళు పట్టుకొని నమస్కరించు చున్న యువతి చిత్రమును, కథానాయిక యగు వాఘిరా చిత్రములుగా భావింపఁబడినవి.

ఆకాలమున జరిగిన ప్రసిద్ధ విషయములను, అజంతా గుహావిహార విన్యాసాదులను, విస్మరింపక యీనవల రచించినను, ఆ విషయము లన్నియుఁ

కథాప్రవాహములో లీనమగునట్లు కల్పింపఁబడినవేకాని బలవంతముగా తెచ్చి పెట్టలేదు. కొండను కోయుచు వాఘిరానది ప్రవహించి తపతీనదిలోఁ కలయుచున్నట్లే, కథానాయిక 'వాఘిరా' యను నాయకుఁడగు కొండప హృదయవిదారణ మొనర్చి తపించి యంతరించినట్లు చేసిన కథాకల్పనము సహృదయుల కాదరపాత్రము కాఁగల దని విశ్వసించుచున్నాను.

అజంతా శబ్దము అచింత్యా శబ్దమునకును, వాఘురా, వాఘిరా శబ్దములు వ్యాఘ్రా శబ్దమునకును ప్రాకృతరూపము లని పెద్దల సిద్ధాంతము. గడియారము పూర్వము ఘటికాగారమున కన్వయించు చుండుటచే నాయర్థముననే యిందుఁ బ్రయోగింపఁబడినది. శబ్ద ప్రయోగములో నట్టి సూక్ష్మములే మరికొన్నియుఁ బండితులు గుర్తింపఁగలరు.

ఈ నవల రచించి వినిపించినప్పుడు శ్రద్ధగా విని, అజంతా స్వరూపము కనులఁ గట్టినట్లు చిత్రించితి వని నాకు ధైర్యము చెప్పి యమూల్యము లగు సూచన లెన్నో చేసిన పూజ్యమిత్రులును, హైదరాబాదు ఆంగ్లశాఖాధ్యక్షులును అగు డాక్టరు పుట్టపర్తి శ్రీనివాసాచార్యులు, ఎమ్. ఏ. పి హెచ్. డి. గారికి నా కృతజ్ఞతాపూర్వక వందనము లర్పించుచున్నాను.

ఈ నవల విద్యార్థులకును సామాన్య పాఠకలోకమునకును అజంతా సంఘారామము జీవద్దశ హృదయములలోఁ గొంతవరకైన హత్తుకొనునట్లు చేయఁగలిగినచో నాప్రయత్నము కృతార్థమైనట్లు పరిగణింతును.

నోరి నరసింహ శాస్త్రి

రేపల్లె
24-12-55

# 1

ఇంధ్యాద్రిపర్వతశ్రేణిలో నున్న అజంతాపర్వతమును రెండుగాఁ జీల్చుచు వాఘిరానది వేగముగాఁ బ్రవహించుచున్నది. అది యన్నెన్ని వేల సంవత్సరములనుండి యాపర్వతమును గోయుచున్నదో యెవరి కెఱుక! వర్షర్తువేళలఁ జూచు వారి కది కొండమీఁదినుండి క్రిందికి దుముకుచున్న పెద్ద వ్యాఘ్రము వలెనే గోచరించును.

ఆ చుట్టుపట్టులఁ బర్వతప్రదేశ మంతయుఁ బెరిగిన పచ్చికతోడను లతాగుల్మములతోడను వృక్షములతోడను హరిత వర్ణము దాల్చి భీషణ మనోజ్ఞముగాఁ జూపట్టును. ఆ పర్వతారణ్యమధ్యమునం దానది చేయు ప్రవాహధ్వని పులి గాండ్రింపు వలె నుండును. వెలుఁగునీడలు పడి దాని కెరటములు బెబ్బులి చారల ననుకరించును. ఆ నది కొండపైనుండి దిగునప్పుడేర్పడు సప్తజలపాతములు పులివేయు గంతులఁ దలపించును. పిమ్మట నది శాంతమగు సరస్సుగా నేర్పడి మరలఁ బ్రవాహముకట్టి తపతీనదిలోఁ గలసి శాంతించుచున్నది. సరిగా వ్యాఘ్రమువంటి దాని యాకారమును జూచిన యాప్రాంత ప్రజలు, ప్రకృతిసౌందర్య మెఱిఁగినవా రగుటచే, దానికి వ్యాఘ్రానది యని పేరుపెట్టిరి. అదే ప్రాకృతభాషలో

'వాఘిరా' గ మాఱి కొలఁది మార్పులతో నిప్పటికిని వాడు కలో నున్నది.

వాఘిరానది యుత్తరతీరమునఁ బర్వతముపై గొప్ప బౌద్ధ సంఘారామ మొకటి యున్నది. వైశాఖపూర్ణిమనాఁ డచట నేఁటేట మహావైభవముగా బుద్ధజయంత్యుత్సవము జరుగు చుండును. దానికి చుట్టుపట్టులఁ గల యశేషజనసమూహ ములే కాక దూరభూముల నుండికూడ భిక్షువులు ప్రభువులు బోధిసత్వసేవకై చనుదెంతురు. ఆప్రదేశము దక్షిణోత్తర భారతభాగములకుఁ బ్రయాణము లొనర్చు యాత్రికులు వింధ్య పర్వతశ్రేణి దాఁటెడి ప్రదేశమునకు సమీపమున నున్నందున వింధ్య కుభయపార్శ్వములనుండియు యాత్రికు లరుదెంతురు.

ఈ సంవత్సర ముత్సవ మైపోయినది. కాని దాని సందడి యింకను బూర్తిగా నడఁగిపోలేదు. జనసమూహము వచ్చి పోవుటచే నచ్చటఁ జేరిన చెత్తచెదార మింకను శుభ్రము కాలేదు. కొన్ని పందిరు లింకను విప్పఁచునే యున్నారు. వాని నలంకరించుటకుఁ గట్టిన చిత్రచిత్రితములైన వితానవస్త్రములు యవనికలు పటములు నింకను బ్రోవులు ప్రోవులుగాఁ బడి యున్నవి. అవి కొన్ని సంఘారామమునకుఁ జెందినవి, కొన్ని శ్రేణీపతులవి, కొన్ని చిత్రకారులవి. ఎవరివి వారి కింకను జేర్పలేదు.

దూరదేశములనుండి వచ్చిన యతిథులలోఁ బలువురు పెద్దలు స్వదేశములకు వెడలిపోయిరి. కొందఱింకను బ్రయాణ

ప్రయత్నములో నుండుటచే వారి సేవకులు సందడిగా సంచరించుచున్నారు. వారిలోఁ బ్రభువులు ధనికులునే గాక వలాపురము నాలంద వంటి సంఘారామములనుండి ప్రత్యేకముగా నాహూతులైన భిక్షువులును బండితులును గలరు. నృత్యములు నాటకములు గాంధర్వవిద్యలు కవిత్వ పాటవము చతుష్షష్టి కళలు ప్రదర్శించిన వివిధవినోదకులు భాగవతులు కథకులు నెందఱో వెడలిపోయిరి. కాని చెదరు వాటుగా నొక రిచ్చట నొక రక్కడ నుండి, నిలిచియున్న పెద్దలకుఁ దమతమ ప్రతిభలింకను బ్రదర్శించుచునే యున్నారు.

అది గ్రీష్మకాల మగుటచే క్షీణించి యున్నను వాఘిరా నది భీషణమనోజ్ఞముగా గంతులు వేయుచు సమస్తము చూచుచునే చూడకున్నట్లు ప్రవహించుచున్నది. తన జలము ననుక్షణము మలిన మొనర్చుచున్న యీ జనముల కాలుష్యములను నిరంతరము తన ప్రవాహామృతధారతోఁ బ్రక్షాళన మొనర్చుచునే యున్నది.

## 2

తెల్లవాఱఁ బోవుచున్నది. చుట్టుపట్టుల జనసమ్మర్దము సందడిగా నున్నను అజంతా సంఘారామాధ్యక్షుఁ డగు

కుమారశ్రీనాథుని యేకాంత గుహామందిరములోఁ బరమ శాంతముగా నున్నది. అతఁడు మేల్కాంచి 'సుత్తపిటకము' నుండి సుత్తములు కొన్ని పఠించి పిమ్మట భక్తిపరవశుఁడై బుద్ధభగవత్ స్తోత్రములు గాన మొనర్చినాఁడు.

కొంతతడవు ధ్యాననిమీలితలోచనుఁడై యుండి పిమ్మట శిష్యుఁ డొకఁడు దివ్వెగొని దారితీయుచుండ వాఘిరానదిలో నాతనికై ప్రత్యేకము నిర్మింపఁబడిన స్నానఘట్టమునకు బయలు దేఱినాఁడు. ఆతఁడు వోవు దారిపొడవునను సోపానపంక్తి కిరు పార్శ్వములను గజములు నాగరాజ ప్రతిమలేకాక, నానావిధ ముద్రలతో బోధిసత్వ విగ్రహములును, భగవానుఁడు కావించిన లీలావిశేషములు మహత్కార్యములును బ్రదర్శించు చిత్రములు నెన్నియో మలఁచియున్నవి. వాని కాతఁడు భక్తి వినమ్రుఁడై నమస్కరించుచు బౌద్ధధర్మాతిశయమును ధ్యానించుచు శిష్యునివెంటఁ బరమశాంతముగా నడచుచుండెను. పాతిక సంవత్సరములుగా నామార్గము కుమారశ్రీనాథునికి సుపరిచిత మగుటచే నక్కడ నాతని కెఱుకలేని యంగుష్ఠమాత్ర ప్రదేశమును లేదు.

ఈ నాఁ డేమది ! అక్కడ నవలోకితేశ్వరుని పాదపద్మములకడ నల్లని నీడ యొకటి క్రొత్తగాఁ గనుపట్టుచున్నదే ! అది కదలుచున్నట్లు కూడ నున్నదే ! అధ్యక్షుని యెడఁ గల భయభక్తులచే నాప్రాంతమున కెవ్వరు నెట్టి వస్తువును వారి యనుజ్ఞలేనిది తీసికొనిరారే !

కుమారశ్రీనాథుఁడు తన మనస్సులోఁ గలిగిన యాశ్చర్యమునకు లోఁబడక యవలోకితేశ్వరుని సమీపించి నమస్కరించినాఁడు. ఆతఁ డెంత వలదనుకొని నిగ్రహించుకొనుచున్నను ఆతని దృష్టియు శ్రవణములును మనస్సును మాటి మాటికి నా నూతనవస్తువు వంకకే యాకృష్ట మవుచున్నవి.

ఆ నీడలోనుండి యీ మాటేదో ధ్వని వినవచ్చినది. అయ్యో, అది యేడ్పు ధ్వని! పసిపాప యేడ్చిన ధ్వని! అన్ని దుఃఖములు వదలి శాంతముగాఁ దపస్సుచేసికొన వచ్చిన యీ వృద్ధభిక్షువు హృదయములో నా పసిపాప యేడుపు గొంతు సూటిగా ముల్లువలె గ్రుచ్చుకొన్నది. ఎన్నఁడునులేని దాతఁడు త్రుళ్ళిపడెను. వంగిపోయిన యాతని దేహయష్టి యాకస్మికముగా నిలువఁబడిన ట్లయినది. వడలి ముడుతలు వడిన యాతని చర్మము రక్తపుఁ బోటుతో నిండుక యెఱ్ఱవాఱినది.

వెంటనే యాతనికి బుద్ధభగవానుని లీలలు స్ఫురించినవి. భగవానుఁడు వైశాఖపూర్ణిమనాడు లోకసంగ్రహార్థము సర్వసంగపరిత్యాగము చేసి పోవ నుండఁగా నానాఁడే తన ధర్మపత్ని యశోధర ప్రథమపుత్రునిఁ బ్రసవించిన దని వార్త వచ్చినది. చివరిసారి ప్రియభార్యను బుత్రుని జూచి పోవలెనని కోరిక జనించి పురిటింటికిఁ బోయెను. నిద్రలో యశోధర చిఱునవ్వు నవ్వెను. అది చూచి భగవానుఁడు మోహముగ్ధుఁడై భార్యా పుత్రులఁ దిలకించుచుండ లోకము లన్నియు దద్దరిల్లె

నఁట! అయ్యో, దుఃఖముతో ఘోషించు మనల నెల్లర నుద్ధరింప భగవానుఁడు బయలుదేఱఁడా? చతుర్దశభువనములు నొక్కపెట్టునఁ గుయ్యిడినవఁట! ఆనాఁడు భగవానునికి వినిపించిన యార్తనాదమువలెనే ఈ పసిపాప రోదనము కుమారశ్రీనాథుని కిప్పుడు భాసించినది.

ఆ పసికందు రోదనధ్వనితోడను దర్శనముతోడను ఆమహాస్థవిరుఁడు పర్వత మడ్డుతగిలిన ప్రవాహమువలెనే యాకస్మికముగా నిలువఁబడిపోయెను. ఘటికాయంత్రమువలె మార్పులేక పాతికేండ్లనుండి నిత్యము సకాలమున కొనరుచు స్నానకృత్యమున కీనాఁ డంతరాయము సంభవించినది. చిరకాలాభ్యాస వశమునఁ దొందరపాటు జయించిన యావృద్ధుని నిశ్చలస్థితి కీనాఁడు భంగము వాటిల్లినది. దేహ మించుక కంపించినది, కన్నులొక్కింత యార్ద్రము లైనవి. శిష్యుఁ డేమియు గ్రహింపక ముందే యావృద్ధభిక్షువు వంగి పొత్తులలోఁ జుట్టియున్న యా పసిపాపను ప్రేమమీఱఁ జేతులఁ దీసికొనెను. అట్టి యసహాయమైన పసికందుల నెన్నడు నెత్తికొనినవాఁడు కాకుండుటచే నాతని చేతులలో నిలువక ఆ పాపతల వెనుకకు వ్రాలిపోసాగినది. అదిచూచి యాతఁడు తొట్రుపాటుతో వెంటనే తన వామహస్తము నాపాప తలక్రిందఁ జేర్చి పట్టుకొనెను. స్నానఘట్టమునకుఁ బోవుట మాని యాతఁడు వెనుదిరిగి తానుండు గంధకుటికి బయలుదేఱినాఁడు. శిష్యుఁడు ఆశ్చర్యపోవుచు నాతని ననుగమించెను. వారి యా వేగములో నప్పు

డాసమీపమున నైన పదముల యలికిడియు నిట్టూర్పును వారు వినిపించుకొనలేదు.

తన గంధకుటి చేరినపిమ్మట నా పసిపాప నేమి చేయవలెనో కూడ నాతనికిఁ దోపలేదు. అభ్యాసము లేని యాతని పట్టు వలన నాపాప కొత్తిడి కలిగి బాధయైనదో, లేక యాఁకలియే యైనదో తెలియదు కాని యాగంధకుటి చేరునప్పటికి పోరువెట్టి యేడువసాగినది. ఆరోదనధ్వని కుమారశ్రీ హృదయాంతరము నిండి యాగంధకుటి నాపూరించి సంఘరామ మంతటనే కాక చతుర్దశ భువనములం దెల్లెడఁ బ్రతిధ్వనించు చున్నట్లా దయామయుని మనస్సునకుఁ దోచినది. తత్తరముతో నాతఁడు శిష్యునికి సంజ్ఞచేసి తాను పూజాకాలమునఁ గూర్చుండు చిత్రాసనమును బఱపించి దానిపై నాపాపను బరుండఁబెట్టెను. పాప యొక్కక్షణకాల మేడుపాపి మరల యథాప్రకారముగా నేడువసాగెను.

ఏమిచేయవలెనో యేమియుఁ దోపక ఆ వృద్ధభిక్షువు విచారముతో నాగంధకుటిలో నిటునటు తిరుగుచుండెను.

## 3

ఈవార్త సంఘరామ మంతటఁ బొక్కిపోయినది. చనవు గల భిక్షువు లందరు నొకరొకరే యచ్చటఁజేరసాగిరి. వా రా

పాపను లాలింప యత్నించుచుండిరి. కాని యెవ్వరికి నది సాధ్యపడలేదు. స్త్రీలుగాని యాపాపను సాకలేరని వారందఱకు నెఱుకయే. ఆగంధకుటిలో నాఁడుపురుషైన నడుగు పెట్టరాదని యీ పాతికేండ్లును జండశాసన ముండుటచే నెవ్వరును నామాట సూచింపలేకుండిరి.

సంఘరామములోఁ బనివారు శిల్పులు, చిత్రకారులు ఇత్యాదుల నివాసగృహము లా సమీపముననే యున్నవి. ఇప్పు డిక్కడ నా విహారములోఁ దూర్పుచివర గుహారామ మొకటి క్రొత్తగాఁ దొలుచుచుండిరి. అందులోఁ బనిచేయుచున్న శిల్పుల పాక లక్కడికిఁ జాల దగ్గరగా నున్నవి. ఆకుటీరములలో నివసించుచున్న వారిలోఁ గొందఱక్కడఁ గూడి గోడమీఁదినుండి యీ వింత తొంగితొంగి చూచుచుండిరి. అందులో సాహసము గల ఐదేళ్ళ కుఱ్ఱవాఁ డొకఁడు గోడ దూకి వచ్చి యాపసిపాప యేడ్చుచున్న గంధకుటి ద్వారము నొద్దకుఁబోయి నిలువఁబడి పండ్లికిలించుచు తొంగి చూచుచుండెను. అనుమతిలేని దట్లు వచ్చినందుల కాతనిని భిక్షువులు చూపులతోఁ దర్జించుచు వెళ్ళిపొమ్మని హస్తసంజ్ఞలు చేయుచుండిరి.

కుమారశ్రీనాథుఁ డది గమనించి కుఱ్ఱవాని వంకఁ దల యెత్తి చూచినాడు. ఆ చిన్నవాని పెద్దనోరు, లావైన పెదవులు, బలమైన దవుడలు, వ్రేలాడు చెవులు, సూదులవలె

సన్నని చిన్నకళ్ళు చిత్రముగాఁ గుమారశ్రీనాథుని నాకర్షించుటచే నాతఁ డాబాలు నాదరముతోఁ బ్రశ్నించెను.

'నాయనా, నీ పే రేమి ?—'

'కొండప !'

'నిజమే ? భగవానుని మొదటి శిష్యుని పేరే ! నీ వెవరి పిల్లవాఁడవు ?—'

'చిత్రకారుఁ డశోకుని పిల్లవాఁడను !'

అధ్యక్షుఁడు మరల నాదరముతోఁ బ్రశ్నించెను.

'ఇక్కడికి రాఁగూడదని తెలియదా ? ఎందు కక్కడ నిలుచున్నావు ?'

పిల్లవాఁడు కొంచెము తడఁబడుచు నుత్తర మిచ్చెను. 'చూచుటకు ! మఱి, నాకే, ఈ పాపను ఓదార్చుటే — తెలియును—'

'రా, నాయనా, ఓదార్చు !' అని వెంటనే కుమారశ్రీ పలికెను. ఆ బాలుఁడు లోని కేగి పాపను బుజముపైఁ బెట్టుకొని బయటి గాలిలోనికిఁ దెచ్చినదే తడవుగ పాప పోరువెట్టి యేడ్చుట చాలించినది. అది చూచిన కుమారశ్రీముఖము వికసించినది. మరలఁ బ్రశ్న వేసినాఁడు.

'మీా రెంద అన్నదమ్ములు, నాయనా ?'

'నాకు నలుగురన్నలు, ఒక్కతమ్ముఁడు, చిన్న పసిచెల్లెలు. దానిని మాయమ్మ యిట్లే యెత్తికొనును !'

మఱికొలదిసేపటికే పాప మరల నేడువసాగినది. ఈమాత్రా కుబ్జవాఁ డెంత యూడించినను పాప యేడు పాగ లేదు. అధ్యక్షుఁడును భిక్షువులును దన్ను చేతకానివాఁ డని చులకనగాఁ జూచుచున్నట్లు గమనించి యభిమానముతో నా కుబ్జవాడు విశదపఱచెను.

'పాప కాఁకలి వేసినది. మా అమ్మచేతి కిచ్చినచోఁ బాలిచ్చి యేడుపు మాన్పఁగలదు!'

ఆ మాటలు విని యధ్యక్షుఁడు 'మీ మాతృదేవతను దీసికొనిరా!' అనఁగానే, కొండప విజయగర్వముతో పరుపునఁ బోయి కూడిన జనులను ద్రోసికొనుచుఁ దనతల్లి ధారణీమాయి నక్కడికిఁ బిలిచికొని వచ్చెను. ఆమె భక్తిగౌరవములతో నధ్యక్షుని పాదములవంకఁ దలవంచి చూచుచు, 'ఏమి పని యున్నది, స్వామీ?' యని యడిగెను.

ఇతర భిక్షువు లానాఁడు జరుగుచున్న వింతలకు క్షణక్షణము నబ్బుర మెక్కువగుచుండ, ఇప్పు డధ్యక్షు డేమనునో వినవలె నని యుత్కంఠతోఁ గుమారశ్రీనాథునివంకఁ జూచుచుండిరి. కుమారశ్రీ కొలఁది మాటలలో విషయము వివరించెను. స్త్రీలతో భిక్షువు లెక్కువ మాటాడరాదు.

'అమ్మాయీ, ఈ పిల్లను మాకు బుద్ధభగవానుఁడు ప్రసాదించినాఁడు. దీనిని పెంచుటకు మాకిక్కడ సాధనములు లేవు. నీ విక్కడికి వచ్చి పోవుచు నీ పిల్లపోషణ చూడఁగలవా?'

ఆమె, 'చిత్తము, నాపిల్లలందఱితోఁబాటు నిది యొకతె. నాకు బరువులేదు.' అనుచు నా పిల్లను జేతులలోనికిఁ దీసికొని పాలిచ్చినది. పిల్ల యేడుపు చాలించి యప్పటికే తల్లి యొద్దఁ జేరిన కొండపవంకఁ జూచుచు చిఱునవ్వు లొలికింప సాగినది.

కొంతసేపైన తరువాత నామె, 'ఈ పిల్ల నిఁకఁ దీసికొని పోయెదనా, స్వామీ?' యని పిల్లను దీసికొని వెడలి పోనుండ నధ్యక్షుఁడు వీలుపడదని వారించెను.

"మే మీపిల్లను వదలియుండ వీలులేదు. దీని పోషణకుఁ గావలసిన యావుపాలు నన్ని వస్తువులు చెప్పినఁ దెప్పింతుము. భగవానుని ప్రసాదము నిక్కడనే యుంచి పోషణ చేయు చుండవలె!"

ఆనాఁడందఱు సెలవు తీసికొని వెళ్ళిన తరువాత నధ్యక్షుఁ డా పిల్లకుఁ బరుండ మెత్తగా నుండుటకై మంచము పట్టువలు వలు నిత్యాదులు తెప్పించెను. అది దొరకినప్పుడు చుట్టియున్న పొత్తులును బట్టువలువలె. ఆ పొత్తులలోఁ జూడగా నొక యమూల్య రత్నాంగుళీయమును, దానిని జుట్టియున్న భూర్జ పత్ర మొకటియుఁ గనుపించినవి. ఆపత్రముపై నేవో యక్షరము లున్నవి కాని యెవరో యభాగ్యురాలి విషాదకథ చదువుటేల యని కుమారశ్రీనాథుఁ డుపేక్షించి యారెండింటిని భద్ర పఱచెను.

ఆ తరువాత మూఁడు దినములకు వాఘిరానది సరోవరముగా నేర్పడుచున్న చోట నొక యువతి శవము తేలినది. ఆ శవము నొడలిపై భూషలేవియు లేవుగాని పట్టువలువలు కట్టియున్నవి. సంఘారామమున కుపాధ్యక్షుఁడగు సంఘజిత్తా శవమును దీసివేయించి ఖననము చేయించెను. అప్పు డా శవము నెందరో చూడవచ్చిరి. కొండపకూడఁ జూడఁ బోయెను. ఆ శవాకారమున నేదో యతని నాకర్షించుటచే నింటికిఁ బోయి పటమొండు తెచ్చి, దానిపై నా రూపము తనకా యీడునఁ జేతనయినట్లు చిత్రించి తండ్రిపటము తీసికొన్నందులకుఁ గోపించునని భయముతో దానిని తండ్రికిఁ గనపడకుండ భద్రపఱచెను. అది యాతఁడు చిత్రించిన ప్రథమచిత్ర మగుటచే రహస్యముగా నప్పుడప్పుడు పైకిఁదీసి తిలకించుచు నానందించు చుండెడివాఁడు.

## 4

ఆ సంఘారామములో రమారమి మూఁడువందల మంది భిక్షువులు తపస్సు చేసికొనుచుండిరి. వారి పోషణ కఱువది గ్రామము లున్నవి. శ్రీసత్యాశ్రయ పులకేశి వల్లభుని ధర్మపరిపాలనములో నా గ్రామముల నుండి రావలసిన యాదాయము సంఘారామమునకుఁ జక్కఁగాఁ జెల్లుచున్నది. అధ్య

క్షుఁడు తలఁచుకొన్న నేమి కొదువ ? ఆ పిల్ల రాజభోగముగా నా సంఘారామములోఁ బెరిగినది. దాని నందఱు లాలించు వారే. ఇతర మేమియుఁ బట్టించుకొనని భిక్షువులుకూడ దాని నెత్తుకొని యాడింతురు. సాక్షాత్తుగా నది భగవానుని ప్రసాదమను భావ మందఱిలో వ్యాపించినది.

అంత గారాబముతోఁ బెరిగినందున నా పిల్లకుఁ బెంకెతనమును బెరిగినది. అదిమొదట దొరకిన రోజున వచ్చినపిల్లవాఁడే దానితో సహవాసమునకుఁ దఱచుగా వచ్చుచుండెను. ఆతఁడు కనఁబడి నంతనే యాపిల్ల కేకిసలు కొట్టును. కాని యేకొంచెము కోపము వచ్చినను, అది యతనినైనను జేతులతోడను గాళ్ళతోడను మర్దించును; గోళ్ళతోఁ బీకి పళ్ళతోఁ గఱచును. అది యేమిచేసినను కొండప నవ్వుచు దానితో నాడుకొనును.

ఆ పిల్ల నడక నేర్చుకొన్నది. ఒకనాఁడు కుమారశ్రీనాథుని దర్శింపఁ బలువురు నూతన భిక్షువులు వచ్చిరి. వారి కాపిల్ల నతఁడు చూపి భగవానుని ప్రసాదమని చెప్పఁగా, వా రాదరముతో దానిని దమ చేతులలోనికిఁ దీసికొనుచుండిరి. అందులో నొక భిక్షువు తీసికొన్నంతనే — ఆ పిల్ల కేమి బాధ కలిగినదో — అది పూజ్యుఁడగు నాతని చేతులలో నుండి యమర్యాదగా విదలించుకొని కుమారశ్రీయొద్దకుఁ బరువున వచ్చినది. అందుల కధ్యక్షుఁ డాపిల్లను శిక్షింప నెంచి, దగ్గఱకు వచ్చినదానిని జేతుల నందుకొనక, కోపించుచున్న చూపుతో నావలికిఁ బొమ్మని సంజ్ఞచేసెను. ఆ పిల్ల సందేహిం

చుచు రెండుమూఁ డంగల దూరమునఁ గొంతతడవు నిలిచి నది. రెండు మూఁడు మాఱు లావలికిఁ బొమ్మని కఠినముగాఁ గుమారశ్రీ సంజ్ఞచేసెను. ఆ పిల్ల చూచి చూచి యొక్క పెట్టున గుమారశ్రీపైకి లంఘించి మీఁదఁబడి కాలుసేతులఁ గ్రుమ్మి గోళ్ళతో అక్కు భుజముపై గాటుపడునట్లు పళ్ళతోఁ బట్టి గట్టిగాఁ గొఱికినది.

ఎన్నఁడు లేనిది మొదటిసారి కుమారశ్రీ పకపక నవ్వుచు నాపిల్ల నాదరాతిశయముతో నొడిలోఁ జేర్చికొని యొడలెల్ల నిమురుచు ముద్దాడి, 'అమ్మా! వాఘిరావలెనే మీఁద దుమికి నావే, వాఘిరా!' అనెను.

ఆ నాఁటినుండి యాపిల్లకు వాఘిరా — వ్యాఘ్రి—అని నామకరణము చెల్లిపోయినది.

## 5

వాఘిరా కంఠము శ్రావ్యమైనది. దాని బుద్ధి మిక్కిలి చుఱుకైనది. ఎందఱో విద్వాంసుల నడుమఁ బెరిగినందున దానికి సులభముగాఁ జదువు వచ్చినది. దాని వ్రాత ముత్యాల కోవ వలె నుండును. భిక్షువులు పారాయణముచేయు 'ధమ్మపదము' లోని వర్గము లెన్నియో దాని నోటికి వచ్చినవి. భిక్షువులు

దానిఁ జేరఁదీసి తమకు వచ్చిన పద్యములు పాటలు నెన్నియో నేర్పు చుండ నవి దానికి శీఘ్రముగాఁ గంఠస్థము లగు చున్నవి.

సమయము కనిపెట్టి వారు దానికెన్నో నీతిబోధ లొనర్తురు. 'కోపము పనికిరాదు. అది మానవులకు శత్రువు. అది జీవులను జన్మచక్రములోనికిఁ బడలాగు పాశము!'– ఈ విధముగా వారు దానిచే నీతిపాఠము చెప్పించు నెడల నది కొంతవరకుఁ జెప్పి యాకస్మికముగా మధ్యలో నాఁగిపోవును.

వాఘిరా దేహము నీలమేఘమువలె కాఱునలుపుగా నుండి యపూర్వకాంతితో శోభిల్లు చుండును. దాని ముఖము కోలదైనది. తీర్చి దిద్దినట్లుండి ముక్కు మూతి చెవులు నెంతో యాకర్షకముగా నుండును. దాని ముఖ మంతటిలోఁ గూడ కన్నులు విశేష తేజోవంతములు. ఆలోచించుచు నాలోచించుచు నది కన్ను లొక్కసారి పూర్తిగా విప్పి తేఱిపాఱఁ జూచినచో, దాని దేహమంతయు నాకన్నులకాంతితో, మెఱపు మెఱసినప్పుడు మేఘమువలెఁ దళతళ లాడును.

నీతిపాఠము మధ్యలో నది యట్లాగి యట్టి మెఱపుఁజూపుతో నాభిక్షువు వంకఁ దేఱిపాఱఁ జూచును. అంతటితో నా భిక్షువు నేర్పుచున్న నీతిపాఠ మాతని కంఠములోనే నిలిచిపోవును. 'నీ వొకనాఁడు కోపించితివే—అతఁ డప్పుడు కోపించెనే ?– అప్పు డధ్యక్షునికే కోపము వచ్చినదే ?– కోప మందఱకు సహజము కదా ! అది యంత చెడ్డదియా ? కాక నాకేనా

కోపము పనికిరానిది?' ఇత్యాదిగా నాపిల్ల ప్రశ్నించుచున్నట్లా చూపులో స్పష్టముగా స్ఫురించును.

ఆ పిల్ల కేపాఠమైన సులభముగా నెక్కింపవచ్చుఁ గాని నీతిపాఠములు మాత్ర మంటవు. అంటించుటే కాదు, చెప్పుటే సాధ్యము కాదు.

అది తఱచుగా నసత్యమాడును. అది యెవరైనఁ గనిపెట్టి యనృత మాడరాదని బోధింపఁ జూచినచో నది పకపక నవ్వును. 'ఈ ప్రపంచమే అబద్ధము అనిత్యము గదా!' యనుచున్నట్లు తన మెఱపుఁ జూపులతో నట్టి భిక్షువును నిర్వాక్కు నొనర్చును. దానికిఁ జేయు నీతిబోధ లన్నియు నిట్లు సగము లోననే తునిగిపోవును.

ఆ సంఘరామములో నెన్నియో తీవ్రనియమము లున్నవి. ఒకరు తపస్సు చేసికొను స్థానమున కింకొకరు పోరాదు. నియమిత వేళలలోఁ దప్ప తమతమ గంధకుటుల వదలిపోరాదు. ఎక్కువ నవ్వరాదు. దినమునకు మాటాడు మాటలకుఁ గూడఁ గొలత యున్నది. స్త్రీలతో మొదలే ప్రసంగింపరాదు.

ఈ సామాన్యభిక్షుక నియమములుకాక భిక్షువులు సాధన కొఱకు విశేష నియమములు పాటించుటయుఁ గలదు. మౌన నియమములు ఆహార నియమములు విహార నియమములు నహింసా నియమములు నెన్నియో కలవు.

కాని వ్యాఘ్రరానదివలెనే వ్యాఘ్రరాయు నన్ని నియమముల నుల్లంఘించును. దానికి వేళలేదు పాళలేదు—ఏ వేళనైన

నెక్కడికైనను నిర్భయముగా నేగును; ఏమాటయైన మాటా డును; ఏమైనఁ జేయును. దాని రాకచేఁ బ్రథమములో భిక్షు వుల నియమబద్ధ జీవితముల కొంతకొంత వికాసము వచ్చినను, అంతకంతకు దాని చేతలవలన వారికిఁ గంటగింపు కలుగ సాగి నది. చండశాసనుఁ డగు సంఘారామాధ్యక్షుఁ డా పిల్లపైఁ బక్షపాత మూనియుండుటచేఁ దమకు వచ్చుచున్న కోపమును దిగమ్రింగుకొను చుండిరి. వాఘిరా యల్లరి పట్టరాకున్నది.

సంఘజిత్తు తన కఠోర నియమములచే సంఘారామములో నుపాధ్యక్ష పదవి నందియుండెను. వాఘిరా కధ్యక్షు లిచ్చు చున్న యలుసుపై విసుగుపుట్టి యొకనాఁ డాతఁడు కుమార శ్రీనాథుల దర్శించి వాఘిరా చేతలచే సంఘారామ నియమ ములకు భంగము కలుగుచున్న దనియు, దానిని దగు శిక్షణలో నుంచుట యవసర మనియు విన్నవించుకొనెను.

సంఘజిత్తెంత యావేగముతో విన్నవించుకొనెనో, కుమార శ్రీనాథుఁ డంత శాంతముగాఁ గరుణార్ద్రకంఠముతో నిట్లుత్తర మొసఁగెను.

"ఆర్యా, ఒక్క పసిపాప యాగడమునకే నీ నియమములు తాఱుమాఱైనచో, భగవానుఁడు మానవుని యాగడములు సైచి యెట్లు ధర్మింపఁ గలిగెనో యాలోచించితివా? వాఘిరా భగవానుని ప్రసాద మను భావముతో సాధన చేయుము, పొమ్ము!"

అధ్యక్షుని వచనము లెంత శాంతముగా నున్నను, సంఘ జిత్తున కవి పరిభవ వచనములుగా భాసించినవి. కన్నులఁ దిరుగుచున్న కన్నీటిని నిగ్రహించుకొనుచుఁ దాను తపస్సుచేయు గంధకుటికి విచారముతో నాతఁడు వెడలిపోయెను.

ఇట్లే యితర భిక్షువులును వాఘిరాపై నధ్యక్షునితో నేరములు చెప్పికొన్నందులకుఁ బరిపరి విధములఁ జీవాట్లు వడిరి. కాని యట్టి సమయములలో వాఘిరా యట్టిభిక్షువు వెన్నంటి పోయి, యాతని కాళ్ళపైఁబడి, కన్నీరు కార్చుచుఁ దన్ను క్షమింపుమని దీనముగాఁ బ్రార్థించును. అంతటితో నా భిక్షువు కూడ నిజముగా నిది 'భగవానుని భిక్షయే' యని తన్ను దా నోదార్చుకొనును. ఆ పిల్లగూడ మరల నెప్పుడు నా భిక్షువునకు నియమ భంగము చేయకుండ జాగరూకత వహించి మెలఁగు చుండును.

అది భయములేని పిల్ల. వాఘిరానది మిక్కిలి వేగము గల వాగు. దాని ప్రవాహమధ్యమున నెన్నియో గండశిలలున్నవి. ఆ ఝరీ ప్రవాహములో నా పిల్ల యీవైపు నుండి యావైపున కీదికొని పోవును; ఆ వైపున మునిఁగి యీవైపునఁ దేలును.

ఆ చుట్టుపట్టుల నెన్నియో పర్వతములు నరణ్యములును గలవు. ఎట్టి దుర్గమశిఖరము నైన నది యుడుప పిల్లవలెఁ జెరచెర ప్రాఁకి పోఁగలదు; ఎట్టిదుర్గమారణ్య మధ్యముననైన మేఁకపిల్లవలెఁ జొచ్చుకొని నిర్భయముగఁ బోవును. దాని

కాటలలో దినదినము నాలుగైదు గండములు తప్పుచుండును. ఏ గండమున కా గండ మెట్లు తప్పినదో చూచినవారికి విన్న వారికి నద్భుత మనిపించును. "ఇది భగవానుని ప్రసాద" మను నధ్యక్షుని భావమున నందఱకు విశ్వాసము దృఢతర మగు చుండెను.

ఈ యాటలు పాటలు సాహస కార్యము లన్నిటిలో నశోక పుత్రుఁడు కొండప దానికిఁ దోడుగా నుండును.

# 6

ఆ సంఘారామములో నప్పటికిఁ బ్రధాన భిక్షువులు తపస్సు చేసికొనుటకును బూజకును గొండలోఁ దొలిచిన గుహారామము లిరువదియే డున్నవి. అందులో నాలుగు చైత్య గుహలు. చైత్యగుహలు దేవాలయములవలెఁ బూజ కుప యోగించునవే కాని భిక్షువుల నివాసమున కుద్దేశించినవి కావు. మిగిలిన యిరువదిమూడు గుహారామములును భిక్షువుల నివాసముల కుద్దేశించిన విహార గుహాలయములు. కాని వానిలోఁ గొన్ని యసంపూర్ణములై నిరుపయోగముగా నున్నవి. గుహలన్నిటికిని మధ్యభాగమునఁ బెద్దవిహారగుహలు రెండు కలవు. అవి యన్నిటిలో, వాస్తుకళ, శిల్పము, చిత్ర రచన—ఎందులోఁ జూచిన సర్వవిధముల మనోహరతమ

మైనవి. ఆ రెండిటిలోఁ దూర్పున నున్న గుహావిహారమునఁ గుమారశ్రీనాథుఁడు తపస్సు చేసికొనుచుండును. ఆ గుహారామ ముఖభాగ నిర్మాణ మద్భుత మైనది. దాని గర్భాలయములోఁ గల బోధిసత్త్వ విగ్రహముపై సరిగా ముఖద్వారమునుండి వెలుఁగు ప్రసరించునట్లు నిర్మించిన శిల్పి చాతుర్యము చూపఱు వేనోళ్ళ శ్లాఘించుచుండురు.

ఈ గుహారామములే కాక సాధకుల భక్తుల నివాసార్థమును, విద్యాశాలలకు, వైద్యశాలలకు, ధర్మశాలలకును నిర్మించిన భవనము లెన్నియో కలవు. అయిన నవి యక్కడి భిక్షువులకుఁ జాలుట లేదు. కొంతకాలమునుండి తూర్పుచివర నూతన గుహారామ మొకటి తొలువఁబడుచున్నది. ఈనూతన గుహారామము తాను తప మొనరించు గుహారామముకంటెను మనోజ్ఞతరముగా నుండవలెనని కుమారశ్రీ యాశయము.అందులకై దూరదేశములనుండికూడ శిల్పుల నాతఁడు రావించెను. అట్లు వచ్చినవారిలోఁ గృష్ణాతీరమున నాగార్జునకొండ ప్రాంతమునుండి వచ్చినవాఁడు కొండపతండ్రి యశోకుఁడు. అశోకుని మీఁదనే యీ నూతన గుహాలయ నిర్మాణభార మంతయు నున్నది.

వాఘిరా తన మిత్రునకుఁ గొండలు కోనలు నడవులు చూపును. కొండప దాని కీ గుహారామములలోని శిల్పసంపద చిత్రకళ రూపించును. వంశపారంపర్యముగా నాతనికి శిల్పము చిత్రకళ యలవడిన వగుటచే, వానిలోని సూక్ష్మము లాతఁ

డిప్తై సులభముగా నవగాహన మొనర్చుకొని దాని హృదయ మునకు హత్తింపఁ జేయఁగలఁడు. ఒకానొక చిత్రము నెదుటనో, విగ్రహముముందో, వారిద్దఱును గలసికాని, వేర్వేరుగఁ గాని, నిలిచి తదేకధ్యానముతోఁ జూచుచు, గ్రంథము తదేకనిష్ఠతోఁ బఠించు శ్రద్ధాళువు లగు విద్యార్థులవలె, దీర్ఘ కాలము గడపుచుందురు. అది చూచిన భిక్షువులును బుద్ధ భక్తులును వారికి భక్తి పారవశ్యము కలిగిన దని గుసగుస లాడుచు వారల యేకాగ్రతకు భంగము వాటిల్లకుండ సడి చేయక నెమ్మదిగా నావలకు నడచిపోవుచుందురు.

పదునైదు సంవత్సరముల క్రిందట నారంభించిన యానూతన సంఘారామ మీ సంవత్సరమే పూర్తియై, అందులో చిత్ర రచనమాత్రమే కొఱవడి యున్నది. అశోకుఁడు చిత్రరచన సాగించుచున్నాఁడు. అది సర్వాంగసుందరముగా సిద్ధమవు చున్నందున వాఘిరాయుఁ గొండపయి దానిని బలుమాఱు దర్శించి వచ్చుచున్నారు.

మఱి యే గుహాలయమునకును లేని ముఖమండప మొండు దీనికిఁ గలదు. ఈ గుహాలయములోఁ బ్రధానభాగములు మూఁడు. ముందు పంచపాళి భాగము, మధ్య చావడి, వెనుక నంతరాళ మున్న గర్భాలయము. పంచపాళినుండి చావడిలోనికి సింహద్వార మొకటి చక్కఁగాఁ దీర్చి దిద్ది నట్లున్నది. దాని కిరువైపుల రెండు వాతాయనములును జివరి యంచున రెండు ముఖద్వారములును గలవు. పంచపాళికి రెండు ప్రక్కల రెండు

గదు లున్నవి. మధ్య చావడి కన్నిరుప్రక్కల నడవలును వాని కావల గదులును గలవు. గర్భాలయమున కిరువైపుల రెండేసి గదులున్నవి. గర్భాలయములో ధ్యానముచేయుచున్న యవలోకితేశ్వర బోధిసత్త్వుని యున్నతమూర్తి యుదాత్త గంభీరముగా మలఁచి యున్నది.

ఆ గుహా స్తంభముల మీఁద గోడల మీఁద నెన్నియో విగ్రహములు లతలు పుష్పములు జంతువులు రమ్యముగా మలఁచఁ బడినవి. అందులో నొక స్తంభమున నాలుగు లేళ్ళు మలఁచియున్నవి. కాని వాని యన్నిఁటికి నొక్కటే శిరస్సు. ఆ స్తంభములో శిల్పసంపద అల్పమైనను, జమత్కారము కల్పించు చిత్రకవిత్వమువలెనే, యా బొమ్మయు జనసామాన్యమును మిక్కిలి యాకర్షించు చున్నది.

ఆ గుహాలయము గోడలమీఁదను లోకప్పుమీఁదను జిత్రరచన సాగుచున్నది. కొన్ని చిత్రములు పూర్తియైనవి; కొన్ని వ్రాయఁబడుచున్నవి; కొన్ని చిత్రించుటకుఁ గుడ్యములు సిద్ధము చేయు చున్నారు.

చిత్రరచనకు ముందు ఱాతిగోడ చదునుగాఁ జేయవలెను. గోడలపై ఱాతి గొగ్గులు సందులు ఉలిపోట్లు కనఁబడకుండుటకై గోడలకుఁ బైకప్పులకు బంకతో గోమయము మట్టి ఊక ఱాతి పొడి, ఇత్యాదిద్రవ్యములు కలిపి మర్దించి బెందడిగాఁ జేసి దానిని మందముగా ఘట్టించి పట్టించుచున్నారు. దాని యుపరి తలము నునుపుగా నుండుటకు నున్నని శిలాఖండములతో

గట్టిగా రుద్దుచున్నారు. అంతట నందుపై ముత్తెపుఁ బొడిచేఁ జేసిన సుధతో ధవళపుఁ బూఁత పూయుచున్నారు. దాని తడి యారకముందే చిత్రింపఁ దలఁచిన చిత్రపు రేఖలు ముందు వ్రాసి మధ్య రంగు లన్నియుఁ బూరింపవలెను. వ్రాసిన రేఖ చెఱుప వీలులేదు. తడియాఱు లోపలనే చిత్రరచన యంతయు నిశ్శేషముగాఁ బూర్తి కావలెను.

ఆ రంగులు చుట్టుపట్టుల దొరకు చెట్లరసముల నుండియు నాకుఁ బసరులనుండియు శిలలలో లభించు గైరికాది ధాతువుల నుండియు మణి వైడూర్యము వంటి ద్రవ్యముల తోడను సిద్ధము చేయుచున్నారు. రంగులకై దూరము పోవలసిన యవసరములేదు. అజంతా పర్వతమే యెన్నో ధాతువులు సమకూర్చుచున్నది. వానితో రంగుల ముద్దలు ముందే యాయత్తము చేసికొని పచ్చిగను జిగురుగను నుండుటకు గంజితో నరుగఁదీయుచుండిరి.

## 7

ఆ గుహారామములో విగ్రహకల్పనము పూర్తిచేసిన పిమ్మట నశోకుఁ డందులో నెక్కడెక్కడ నేయేచిత్రము లెట్లు లిఖింప వలెనా యని యాలోచించుచు బహుకాలము గడపియుండెను. ఆ దినములలో రాత్రింబవళ్ళు నా గుహారామములో నాతఁడు

చిత్రశూన్యములుగానున్న దానిగోడలవంకను పైకప్పువంకను జూచుచు ధ్యాన నిమగ్నుఁడై యేకాంతముగా జాములకొలది నిశ్చలముగా నిలుచుండియో కూర్చుండియో పరుండియో మననము చేయుచుండువాఁడు. ఆ శిలను మందిరాకారముగా దొలిచి, స్తంభములు గర్భాలయము నిత్యాది ప్రదేశముల విగ్రహములు మలఁచి సాధించిన ఘనకార్యమున కాతని కేమాత్రము తృప్తిలేకుండెను. ఆకుడ్యములును బై పటలాంతర్భాగమును జిత్రాలంకారశూన్యములై యుండి, యాతని ననుక్షణము నవి తమ్ము శీఘ్రమే పూరింపుమని తొందరవెట్టుచున్నట్లాతనికి భాసించుచుండెను. అశోకునికిఁ జిత్రరచన కావింప వ్యగ్రత యతిశయించు చున్నకొలది భావములు దొంతరలుగా రా సాగినవి. ఆ భావ పరంపర నతికష్టమున నిగ్రహించుకొని యాతఁడు చిత్ర నిర్మాణక్రమము నిశ్చయించుకొనెను.

గర్భగుహకు రెండు పార్శ్వముల రెండు బోధిసత్త్వ చిత్రములు పరిమాణమునను స్వరూపమునను ఉన్నతోదాత్తరమణీయముగాఁ జిత్రించు టవసర మని ముందుగనే నిశ్చయించెను. అందులో నొకటి సర్వసంపదలు నీప్సితములు చేకూర్చు పద్మపాణి బోధిసత్త్వచిత్రము. అందులోఁ దనప్రజ్ఞ యంతయుఁ బ్రదర్శింపవలె నని యాతని సంకల్పము. రెండవది శత్రు సంహారకమును సర్వాపన్నివారకమును అగు వజ్రపాణి బోధిసత్త్వుని చిత్రము. ఈ రెండే కాక మఱికొన్ని బోధిసత్త్వ చిత్రములును స్ఫురించినవి.

కుమారశ్రీనాథుఁ డొకనాఁ డా గుహారామము దర్శింప వచ్చి, యశోకుఁడు చిత్రింప నెంచిన చిత్రముల వివరము లడిగి, యిందులో మారధర్షణ చిత్రము ముఖ్యముగా నుండవలె నని సూచించెను. భగవానుఁడు బుద్ధత్వము ప్రాపించిన వెంటనే, మారుఁడు వచ్చి నయమునను భయమునను భగవానుని లోఁగొన యత్నించి ధర్షితుఁడై విఫలప్రయత్నుఁడైన కథ యిందులోఁ జిత్రించుట యవసర మని యశోకుఁ డంగీకరించి సంఘాధ్యక్షుల సూచన నాతఁడు శిరసావహించెను.

సిద్ధార్థుఁడై పుట్టి బుద్ధత్వము పొందుటకుఁ బూర్వము, బోధిసత్త్వుఁ డెన్నియో జన్మములెత్తి యొక్కొక్క జన్మమున నొక సద్ధర్మము ననుష్ఠించి యందులోఁ బారంగతుఁ డగుచువచ్చెను. అట్టివి వర్ణించు జాతక కథలు సహస్రాధికముగా నున్నవి. అందులోనుండి యేవి గ్రహించుట ?

ముందాతని నాకర్షించినది 'శిబిజాతకము'. శిబిచక్రవర్తిగాఁ బుట్టి డేగ వెంటాడుచున్న పావురమునకు శరణమిచ్చి, డేగ కాహారముగాఁ దన శరీరమాంసము కోసియిచ్చిన బోధిసత్త్వుని జాతకకథ యాతని నాకర్షించుట వింతకాదు. మఱికొన్ని జాతక కథలు గూడ నెన్నుకొని 'మహాజనక జాతక కథ' విపులముగాఁ జిత్రించినచోఁ దన కళావైదగ్ధ్యము విస్తారముగఁ బ్రదర్శింప వచ్చునని యాతఁడు నిశ్చయ మొనర్చెను.

రాజసోదరుఁడు రాజును సంహరింప గర్భవతియగు రాణి పారిపోయి దేశాంతరమున బోధిసత్త్వునిఁ బ్రసవించి యతనికి

మహాజనకుఁ డని పేరుపెట్టెను. ఆతఁడు వర్తకము చేయుచు సముద్రయానము చేయుచుండ, నా నౌక తుపానులోఁ బగిలి పోయెను. మహాజనకుఁడు రక్షితుఁడై యొక రాజ్యము చేరికొన నారాజాతని వృత్తాంత మెఱింగి సీవలి యను రాజకుమారి నిచ్చి వివాహ మొనర్చెను. కొంతకాలమునకు వైరాగ్యము కలిగి మహాజనకుఁ డరణ్యమునకుఁబోవ నిశ్చయింప, రాణి సీవలి యాతని నెన్నియో విధముల మోహముగ్ధునిఁ జేయ యత్నించియు లాభములేక తుద కాతనితోఁబా టరణ్యావాసమున కేగెను. ఈ మహాజనక జాతకకథ చిత్రింప నిశ్చయించిన పిమ్మట నశోకుఁడు చిత్రరచన కుపక్రమించెను. అశోకుఁ డట్లు ప్రధాన చిత్రము లెక్కడ నేయే రంగులతో లిఖింపవలెనో స్థిరపఱచుకొని శిష్యులచేతను సహాయ చిత్రకారులచేతను దాను గుర్తించిన ప్రదేశములలోఁ గుడ్యమును మొదటి బెందడి పూఁతతో సిద్ధము చేయించుచుఁ దానుగూడ వారి కందులో సాయపడుచుండెను. ఈ పనులలో వాఘిరాయును గొండపయుఁ గూడఁ దమచేతులు వేయుచుండిరి.

మొదటి పూతయైన పిమ్మటఁ బైన ముత్యపుఁ బొడితోఁ జేయు సుధాలేపనమును దానిపై రేఖలు తీర్చుటయు రంగులతోఁ జిత్రములు పూరించుటయు — ఈ పనులు మాత్ర మశోకుఁడే స్వయముగాఁ జేయుచుండెను. ఆ పని యితరుల కప్పగింపఁడు. ఆతఁ డట్లు చిత్రించునపు డన్యుల నెవ్వరి నచ్చట

నుండనీయఁడు. ధ్యానభంగము నాతఁ డేమాత్ర మోర్చు వాఁడు కాఁడు!

లోపలిగది వామభాగమున వెనుక గోడమీఁదఁ బెద్ద యెత్తున పద్మపాణి బోధిసత్త్వుని చిత్రము వ్రాసినాఁడు. సువర్ణచ్ఛాయ గల బోధిసత్త్వుని సాధుసుందరాకారము భక్తి గౌరవములు కలిగించుచున్నది. చామర గ్రాహిణులు కిన్నర గంధర్వులు మనోహరముగ నున్నారు. రాజదంపతులయు మయూరములయు శృంగారక్రీడలు రమ్యముగా నున్నవి. సింహములు కోఁతులు నశోకాదితరులతాగుల్మములు నానంద పరవశములుగాఁ జిత్రింపఁ బడినవి. పద్మపాణి బోధిసత్త్వుని చిత్రమునకు వామభాగమున నించుక క్రిందుగా నొక ప్రదేశము నశోకుఁడు శూన్యముగా వదలినాఁడు. నెలలు జరిగిపోవు చున్నను ఆ ప్రదేశమున నేమి చిత్ర మెట్లు వ్రాయవలెనో యాతనికి నిశ్చయము కాలేదు. ఏకాంతముగా నా శూన్య ప్రదేశము నెదుటఁ గూర్చుండి యెన్నియో రాత్రులు లాతఁడు జాగరణ మొనర్చినను స్ఫురింపలేదు. పద్మపాణి పాదము లంటి ధ్యానించినను దన కర్తవ్యము స్ఫురింపకుండుటచే నానాఁటి కది యాతని కొక విచిత్రమైన బాధగాఁ బరిణమించినది. ఇతర చిత్రము లెన్నియో పూర్తిచేయుచున్నను పద్మపాణి సమీపమున నున్న యా శూన్య ప్రదేశమున నశోకుఁ డేమియుఁ జిత్రింప లేకున్నాఁడు.

# 8

ఒకనాఁ డశోకుఁడు చావడినడవకు ఎడమవైపున గుహలో మహాజనక జాతకములో 'నౌకాభంగము' చిత్రించుచుండెను. సుధపై నల్లని మసిరంగుతో రేఖలు ముందు గీచినాఁడు. అట్లాకార మేర్పడిన బొమ్మ మధ్య రంగులు పూరించినాఁడు. సుధ యాఱిపోక ముందే చిత్రమంతయుఁ బూర్తికావలె నను తొందరలో మాధ్యాహ్నిక భోజనమున కైన నింటి కేగక సాయంతనము వఱకు నచ్చటనే యుండి చిత్రరచన సాగించు చుండెను.

అంతసేపు నావల మధ్య మధ్య నేదో యలికిడి యవుచున్నట్లాతనికిఁ దోచినది. ఎలుకలో యుడుతలో చేయు సవ్వడి యని సరిపెట్టుకొనుచుఁ దన చిత్రరచనలో వ్యగ్రతతో నిమగ్నుఁడై యుండి యది మనస్సునకుఁ బట్టించుకొనలేదు.

సాయంకాల మైనది. చిత్రము పూర్తియైనది. రేఖలు దాఁటి ప్రక్కల కింకిన రంగును దొలగించుచు, మరల నట్టి యెడలఁ దూలికతో రేఖలపై వ్రాసి టాపీతో నొత్తి వ్రాసి సరిచేయుచున్నాఁడు. ఈ మాఱు ఆవల స్పష్టముగా నెవరో యిద్దఱు నవ్వుచున్న శబ్దము వినఁబడినది.

అశోకుఁ డులికిపడి కోపావేశముతో నటు పోయినాఁడు. తాను శూన్యముగానుంచిన యఱముందు వాఘిరాయుఁ గొండ

పయు నిలుచుండి యేదో గుసగుస లాడుచుండుట యాతఁడు గమనించినాఁడు.

"ఇక్కడి కెందులకు వచ్చితివిరా, విధవా!" అని యావేశముతోఁ గుమారునిఁ గొట్టుట కాతఁడు తన చేతనున్న పెద్ద కుంచె ఎత్తినాఁడు. ఆతని కోపావేశము చూచి వారిద్దఱు భయాతిరేకముతోఁ బ్రక్కలకుఁ దప్పుకొని యతనికిఁ జిక్కకుండ గుహలోనుండి పాఱిపోయిరి. ఏ మా యాశ్చర్యము !

ఆ యఱ యిప్పుడు శూన్యముగా లేదు. అక్కడ 'నల్లరాణి' చిత్ర మద్భుతముగాఁ జిత్రింపఁబడి యున్నది. కుమారునిఁ గొట్టుట కెత్తిన యశోకుని చేయి యెత్తినట్లే యున్నది. ఆ బొమ్మను జూచిన చూపు లాబొమ్మ మీదనే ఱెప్పలార్పక నిలిచి పోయినవి. ఎన్నో నెలలుగాఁ దాను సాధింపలేని దుష్కరచిత్రవిన్యాసము బుద్ధభగభనుఁ డీనాఁ డిట్లు సాధించి పెట్టినాఁడు. ఆవలఁ దాను చిత్రించిన పద్మపాణి చిత్రమున కిది దీటుగా నున్నది. పరిపరి విధముల నశోకుఁడు దానిని బరీక్షించి చూచెను. ఎన్ని విధములఁ జూచిన నీ 'నల్ల రాణి' చిత్రము తాను రచించిన పద్మపాణి చిత్రమునకు సంపూర్ణత చేకూర్చుచున్నదని యాతనికిఁ దోఁచినది. ఇది భగవానుని ప్రసాదమే సాధింపఁ గలదు !

చిత్రకారుఁ డా చిత్రమువంకఁ జూచి చూచి యానందము పట్టలేక పరుగెత్తుకొని పోయి, ముందుగా ననుమతియైన నడుగక కుమారశ్రీనాథుఁడు తపస్సు చేసికొను గంధకుటిలోని

కేగి యధ్యక్షునికి మ్రొక్కి యానందబాష్పములు రాల్చుచు, 'నిజముగా వాఘిరా భగవానుని ప్రసాదమే, దేవా!' అని యావేశముతో నఱచెను.

అట్లశోకుఁడు కావించిన ధ్యానభంగమునకుఁ గుమారశ్రీ మొదటఁ గొంచెము విసుగు చెందియు, నాతని యార్తకంఠము నానందవాక్కులు నాలకించి విస్మయముతోఁ జిత్రకారునివంక బ్రశ్నార్థకముగఁ దలయెత్తి తిలకించెను.

"వాఘిరా బుద్ధ ప్రసాదమే. ఆతల్లి యల్లరి చూచి మధ్య మధ్య విసుగుకొనెడి వాఁడను. నాతప్పు క్షమింపుఁడు!—వాఘిరా భగవానుని ప్రసాదమే!" అని చిత్రకారుఁ డనెను. అధ్యక్షుఁడు మౌనముతో నట్లే చూచుచున్న కొలఁదియుఁ జిత్రకారుఁడు మరల మరల, 'వాఘిరా భగవానుని ప్రసాదమే! నిజమే. ఇన్నాళ్ళు తెలిసికొనలేకున్న నాపాపము క్షమింపుఁడు!' అనుచు దీనముగాఁ బ్రార్థింప సాగెను. కుమారశ్రీ తుద కాశ్చర్య మాపుకొనలేక యేమి జరిగినదో చెప్పుమన నశోకుఁ డిట్లు విన్నవించెను.

"నే నెన్నో నెలలుగా తేయింబవళ్ళు నాలోచించియు నేమి చిత్రము వ్రాయవలెనో యాలోచన తెగక బాధపడుచు శూన్యముగా నుంచిన యఱలోఁ జిత్ర మొకటి యద్భుతశక్తితో వాఘిరా యీనాఁడు పూరించినది. శ్రమయనుకొనక తమ రొకమా రాచిత్రము స్వయముగాఁ దిలకించుటకు దయ చేయవలె!"

ముడుతలు వడిన కుమార శ్రీనాథుని ముఖమును హిమా ద్రినివలెఁ జిలునవ్వు వెన్నెలలు కాంతిమంత మొనర్చుచుండ, నాతఁడు చిత్రకారునివెంట నా నూతన గుహాలయమునకు బయలుదేఱెను. మధ్యమధ్య నాతఁ డట్లు వచ్చి యాగుహా రామమును జూచి పోవుచు నిర్మాణాదులకు సూచన లిచ్చి పోవు చుండుట క్రొత్తకాదు. పద్మపాణి చిత్రము నొద్ద గోడ మీదఁ జిత్రరచనకై ఘట్టన మొనర్చి చిత్రము వ్రాయక శూన్యముగా నున్న యా యఱ యధ్యక్షుని దృష్టి నాకర్షిం చియే యుండెను. ఇప్పుడు పోయి చూడఁగా నక్కడ 'నల్ల రాణి' చిత్ర మద్భుత ప్రజ్ఞాచాతుర్యములతోఁ జిత్రింపఁబడి యున్నది. తడి యింక నాఱకుండుటచే నాబొమ్మ వింత మెఱుఁగులు చిమ్ముచుండెను.

ఆవల 'పద్మపాణి బోధిసత్త్వుని' చిత్రము సువర్ణచ్ఛా యతోఁ గుడిచేత నీలోత్పలము పట్టి యెడమచేయి జ్ఞానముద్ర ధరించి యుండి ధ్యానాసక్త విలోచనములతో నాకర్షించు చుండ, నీవల 'నల్లరాణి' చిత్రము నీలకాంతితో విరాజిల్లుచు నర్ధచంద్రాకృతిగా వంగియున్న నాళముతో కలువ నొకటి చేపట్టి, పద్మపాణి తల యొంపున కనుగుణముగాఁ దనతల వాల్చి శృంగారరసమయ మైన చిత్తశాంతితో పద్మపాణి శక్తివలె ముగ్ధమనోజ్ఞముగా నలరారుచు ముల్లోకముల మోహింపఁ జేయునట్లు తను ప్రమాణముగా నిలిచి యున్నది.

కుమారశ్రీనాథుఁడు తదేకధ్యానముతో నా చిత్రము వంకఁ జూచుచు నిశ్చలముగా నిలువఁబడి పోయెను. ఆ వృద్ధ భిక్షువు హృదయకుహరములో నే నలుబది యేండ్లకుఁ బూర్వమో యనుభవమునకు వచ్చి, యిన్నేళ్ళు విస్మృతి పథమునఁబడిపోయిన భావము లీనాఁ డొక్కుమ్మడిగా రేకెత్తిన వేమో మఱి! తన్నుఁ బ్రేమించియుఁ దలిదండ్రుల బలవంత ముచే నింకొకని వివాహమాడిన తన ప్రియురాలి రూపమే యిందులోఁ జిత్రింపఁబడిన ట్లున్నది. ఆమె యితరుని భార్యయే యైనను, దనవంక మోహము వదలక యొకనాఁటి సాయం కాలమున నగరోపాంతవనములోఁ దన కామె దర్శన మిచ్చి, తన యాఅన్రిపేమ ప్రకటించినది. ఆమె పలుకులు వినఁ దన కసహ్యమైనది. పులి వెంటఁబడిన లేడివలెఁ దాను పాప భీతితోఁ బాఱిపోయి వచ్చి సంఘారామము చేరి యుపసంపద స్వీకరించినాఁడు. నగరోపాంతవనములోఁ దన ప్రియురాలు తన హృదయాంతరాళములో నా సాయంవేళ కలిగించిన వ్యామోహ మిప్పు డిన్నేళ్ళకీ వార్ధకములో నీచిత్రము చూచు చుండ నిప్పుడే యనుభవించు చున్నట్లు క్రొత్తగా భాసించినది. కుమారశ్రీనాథుఁ డాపాదమస్తకము కంపింపసాగెను. తన స్వానుభవము భగవానునకే కాక మఱి ఎవరి కెఱుక!

“భగవానుఁడా, నన్ను రక్షింపుము! రక్షింపుము!–” అని దీనముగా నాక్రందన మొనర్చుచుఁ గుమారశ్రీనాథుఁ డడుగులు పెట్టుటకైన నోపిక లేకున్నను భయముతోఁ బరు

విడుచుచుఁ దన గంధకుటికిఁ బాఱిపోయెను. ఆ వింత ప్రవర్తనము నకు సంఘారామ మంతయు విస్మయముతో నట్టుడికిన ట్లుడికి పోయినది.

వాఘిరాయు దాని మిత్రుఁడు కొండపయు నశోకునిఁ జూడఁగనే భయముతో నూతన గుహనుండి పాఱిపోయి యా రాత్రి మెల్ల నరణ్యములో గడపుటచే నిచ్చట నేమైనదియు వారికిఁ దెలియలేదు.

వాఘిరా నెలవునకు రాలేదని యా చుట్టుపట్టులఁ బర్వతారణ్యప్రదేశము లన్నియు సంఘారామసేవకులు కాగడాలు పెట్టి వెదకినను జాడ కానరాలేదు.

కొండప తల్లి ధారణీమాయి కుమారుని జాడ తెలిసినదా యని భర్తను మాటిమాటి కడుగుచు నారాత్రి నిద్దురపోలేదు. అశోకునికిని నిద్దుర లేదు. కుమారుఁడు కనఁబడలేదని కా దాతని చింత. వాని నేమి చేసినఁ బాపము లేదు. భగవానుని ప్రసాదము వాఘిరా కనఁబడలేదని యాతని దిగులు. సంఘారామము ముందు దివిటీ లెప్పుడు కానవచ్చినను జిత్రకారుఁ డటు వోయి సేవకులను, "వాఘిరా దొరకినదా? భగవానుని ప్రసాదము దొరకినదా?" యని వారి నుత్కంఠతోఁ బ్రశ్నించి వచ్చుచుండెను.

తన నెలవు చేరినదాది కుమారశ్రీనాథుఁడు సంధించిన వానివలెఁ బలువరింప సాగెను. తీవ్రముగా జ్వరము వచ్చినది.

సంఘారామ వైద్యు లుద్విగ్నహృదయములతోఁ జికిత్సచేయ యత్నించుచుండిరి.

ఆ మఱునాటి సాయంకాలమున కాఁకలితో నీరసించి సొమ్మసిలి పడియున్న వాఘిరాను దాని మిత్రుని నడవిలో నొక రావిచెట్టుక్రింద సంఘారామ సేవకులు చూచి సంఘారామమునకుఁ జేర్చిరి.

## 9

కుమారశ్రీ యస్వస్థుఁడై యున్నందున సంఘారామ వ్యవహారము లుపాధ్యక్షుఁ డగు సంఘజిత్తు చూచుచుండెను. వెనుక వాఘిరా యాగడము లాతఁడు కుమారశ్రీకి విన్నవించుకొని చీవాట్లు తినెనుగదా! అప్పటి కాతఁడు లొంగినట్లే యున్నను, ఆతని హృదయాంతరాళములో వాఘిరా యన్న నసహ్యము పోలేదు. అందును బదేళ్ళ యీడువచ్చి పెద్దదగుచున్న యాపిల్ల యట్లేకాంతముగఁ గొండపతో నడవులలోఁ గొండలలో సంచరించుచుండుట యాతని కేమాత్ర మిష్టము లేకున్నది. ఇప్పుడాతని కవకాశము చిక్కినది. అట్లడవిలో నుండి సేవకులు తెచ్చినరోజున నాతఁడు వాఘిరా నప్పటి కేమియు ననక, కొండపను ముక్క చీవాట్లు పెట్టెను.

కొండప కన్నీళ్ళు కార్చుచు నింటికిఁ బోగా నశోకుఁ డెదురై యాగ్రహావేశముతో, 'ఓరి విధవా, భగవానుని ప్రసాదము నీ పొట్టఁబెట్టుకొనువాఁడవే!' అనుచు దండింపఁ బోవుచుండ, ధారణీమాయి యడ్డు వచ్చి తప్పించి యాఁకలిచే నీరసించి యున్న పిల్లవాని కాదరముతో నాహారము పెట్టుచుఁ గన్నీరు పొరలుచుండ నాతనికి బుద్ధులు చెప్పసాగెను.

"నాయనా, నీ కోసము నిన్నటినుండి యెంత దిగులు పడితినిరా! ఆ పాడు వాఘిరాతో సహవాసము చేయకు తండ్రీ! అది యెప్పుడో ఏ పులినోటికో నిన్నప్పగించి పకపక నవ్వునురా! అది పులి పిల్లరా, మానిసి కాదు!"

తక్కిన పిల్లలుకూడఁ గొండప చుట్టుఁ జేరి పది మాటలు చెప్పసాగిరి. వారందఱిలోఁ గడగొట్టుది యగు నాఁడుపడుచు కన్ను లాశ్చర్యముతోఁ బెద్దవిగా విప్పి యిట్లన్నది:

"అమ్మా, వాఘిరా గోళ్ళు నిజముగాఁ బులిగోళ్ళే నే. ఒకసారి దాఁగిలిమూఁత లాడుకొనుచు నది పొదలో దాఁగుకొనఁగాఁ బట్టుకొనుట కక్కడికిఁ బోయి నేను చూతునుగదా, అక్కడ వాఘిరా లేదే. అచ్చముగాఁ బులిపిల్ల యున్నది. నే నదిచూచి భయపడి కెవ్వున కేక వేసి పాఱిపోయి వచ్చితిని. మరల కొద్దిసేపటికే మామూలు వాఘిరాయే నవ్వుచు నా పొదలోనుండియే బయటికి వచ్చినదే, అమ్మా!"

ఇంతలో నశోకుఁడు కుఱ్ఱవానిని వదలి వాఘిరా క్షేమ మారయఁ బోయెను. అది యప్పుడే కొంచెము రొట్టె తిని

పాలు ద్రావినది. అందుపై వచ్చిన యోపికతో నొక ఱాతి బండపైఁ గూర్చుండి కూనిరాగములు తీయుచు నడవిపాటలు పాడుచున్నది.

"అడవీ, అడవీ, మీ నాన్నెవరే ?
అక్కడ పెరిగే అశ్వత్థమ్మే !
అడవీ, అడవీ, మీ అమ్మెవరే ?
అగ్గులు పూసే ఆ యశోకమే !
అడవీ, అడవీ, నీ కొడు కెవరే ?
అదుగో కూ యను నా పికమే !
అడవీ, అడవీ, నీ పిల్లవరే !
ఆటల పాటల ఆ సెలయేటే !
అయితే, అడవీ, నీ మగఁ డెవరే ?
అడుగకు అడుగవె ఆ కొండన్ !—"

ఆ వింతపాట వాఘీరా పాడుచుండ దాని కంఠమాధుర్యమునకు ముగ్ధుఁడై వినుచు నశోకుఁడు నిలువఁబడి పోయెను. సరిగా నప్పు డది యున్నది యాయర్ధచంద్రాకృతి గల యాకొండకోనలోని మధ్యప్రదేశమునఁ గల బోధివృక్షమూలమున. అచ్చటనే కుమారశ్రీ తప మొనర్చు గుహారామమును, దానికిఁ బడమరగా నశోకుని గురువు చిత్రించిన చిత్రములున్న గుహారామమును గలవు. అశోకుని గురు విప్పుడు చిత్రరచన చాలించి త్రిరత్నములు స్వీకరించి బౌద్ధభిక్షువై యాగుహా

రామములోఁ దపస్సు చేసికొనుచుండెను. అటువైపునకు వచ్చినప్పు డశోకుఁడు గురువుల దర్శించి మ్రొక్కి గాని పోఁడు. ఈనాఁ డాలోపలికే పోక వాఘిరాను బలుకరించి యది యా 'నల్లరాణి' చిత్ర మెట్లు చిత్రించెనో తెలిసికొనవలెనను కుతూహలముతో నాఁగి యుండెను.

వాఘిరా కొంతవడి తనపాట పాడుకొని, మఱి కొంతవడి పరధ్యానముగా నేదో యాలోచించుచు నుండి, యా తర్వాత చిత్రకారుని రాక గమనించినది. వెంటనే యది చంగున గంతువేసి యాతని మెడ గట్టిగా 'మామా!' యనుచుఁ గౌఁగిలించుకొనెను. భగవానుని ప్రసాదము లభించిన దని యానందముతోఁ జిత్రకారుఁడు దానిని కన్నుల కద్దుకొను చుండెను.

కాని వాఘిరా యాతని వీపంతయుఁ దన గోళ్ళతో అక్కి వేయుచున్నది; "కొండపను గొట్టవుగదా!- కొట్ట నను!" అనుచున్నది.

కొండప పేరెత్తఁగనే చిత్రకారునికిఁ గోపము మండి పోయినది. "ఆ విధవను గొట్టుటేనా? చర్మ మొలిపించెదను. చంపివేసెదను-"

ఆ పలుకులు వినఁబడినదే తడవుగా, వాఘిరా రెండుచేతుల గోళ్ళు నతని వీపునఁ బులిగోళ్ళవలె దిగఁబడి పోయినవి. "కొండపను గొట్టితివా, నిన్నుఁ జీల్చి వేసెదను. గొంతు

కొట్టికివేసెదను!- కొండపను గొట్టనను!" ఈ విధముగాఁ బలుకుచు వాఘిరా విజృంభించినది.

చిత్రకారుఁడు నివ్వెఱవోవుచు, "సరే, కొట్టనులే, విడు! నిజముగా నా కొకమాట కుత్తర మొసఁగితివా, అతని నెన్నటికిఁ గొట్టను. ఆ చిత్రము వ్రాయవలెనని నీ కెట్లు స్ఫురించినదో చెప్పవా, వాఘిరా?" అని బ్రతిమాలెను.

వెంటనే పకపక నవ్వుచు, వాఘిరా యశోకుని వదలిపెట్టినది. "మామా! ఆ బొమ్మ నేను వ్రాయలేదు. కొండప వ్రాసినాఁడు. ఏమియుఁ దోపక నన్నెదురుగా నిలుచుండు మని, వాఁడు మాటిమాటికిఁ దలయెత్తి నావంకఁ జూచుచు నా బొమ్మ వ్రాసినాఁడు. నేను నవ్వాపుకొనలేక పోయితిని. ఆ గోడ పాడుచేసినాఁడా-? నేను తేపు చెఱిపి పెట్టెదనులే! - కొండపను గొట్టఁబోకు, మామా!"

వాఘిరా మాటలు చిత్రకారుఁడు నమ్మక యింక నేమేమో మాటాడుచుండెను. అంతలో సంఘుజిత్తచ్చటికి వచ్చి యశోకునివంకఁ జుఱచుఱ చూచుచు, 'నీ కుమారుఁడే యను కొంటిని. నీవును దీనిని బాడుచేయు చున్నావా!' యని మందలించెను.

చిత్రకారుఁడు పరాభవమంది సిగ్గుతో నింటికేగి కుమారునిఁ బిలిచి, 'ఒరే, నిజము చెప్పు! ఆ చిత్ర మెవరు వ్రాసిరి? నిజము చెప్పనిచోఁ జంపివేసెదను!' అని కఠినముగాఁ బలికెను.

కొండపకుఁ బదునై దేళ్ళు వచ్చినను మనస్సులోఁ బసితనము వదలలేదు. "నేనే నాన్నా, నేనే! మరల నట్లు వ్రాయనులే, నన్ను కొట్టకు! వాఘిరాను జూడఁ జూడ నది పెద్దదైనచో నే యాకారము పొందునో యాలోచించు కొనుచు నా పిచ్చిగీతలు గీసినాను. మనస్సు ఉబలాట మాపు కోలేక వ్రాసినాను. మరల నట్లు గోడ పాడుచేయనులే, కొట్టకు నాన్నా, కొట్టకు!–" అని కొండప బ్రతిమాలుచుండెను.

ఈమాఱు కొండప నశోకుఁడు ప్రేమతో గాఢాలింగన మొనర్చుకొని యానందబాష్పములతో నాతని శిరస్సు తడిపి వేసెను.

"ఏమది, అబ్బాయిని జంపుచున్నారు. మీ కేమైనఁ బిచ్చియా?" అనుచు ధారణీమాయి యశోకుని లాగివేయు వఱకు నాతని బిగికౌఁగిటఁ బిల్లవాఁడు నలఁగిపోవు చుండెనని యశోకుఁడు గ్రహింపలేదు.

# 10

ఆ సంఘారామ మున్న కుంతలదేశమును బాలించుచున్న శ్రీసత్యాశ్రయపులకేశివల్లభచక్రవర్తి సంఘారామము దర్శింప రానున్నాఁడని వార్త వచ్చుటచే, మహారాజుల కాతిథ్య

మిచ్చుట కెన్నియో ప్రయత్నములు జరుగుచున్నవి. కుమార శ్రీనాథుఁడు బలహీనముగా నున్నందున సంఘజిత్తే సంఘారామ వ్యవహారము లింకను జూచుచుండెను. మహారాజులు కొలఁది పరివారముతో వచ్చి, యే కొలఁది గడియలో యట నుండి, భిక్షువులఁ గుశలప్రశ్న మొనర్చి పోవునని తలంచి సంఘజిత్తు ప్రయత్నము లన్నియు నందులకే తగినట్లు చేసి యుండెను. అతఁ డెన్నడు లేనిది చిత్రరచన సాగుచున్న నూతన గుహారామమున కేగి యశోకునికో నందలి గోడపై నొకచో మహారాజుల ప్రీతికై వారి చిత్ర మొకటి వైభవముగా లిఖింపు మని యాదేశించెను. అశోకుని కంతస్సున నిష్టము లేకపోయి నను, సత్యాశ్రయపుల కేశివల్లభుఁడు వైభవముగాఁ గొలువుతీరి, విదేశముల రాయబారులు తెచ్చిన కానుక లందుకొను చున్నట్లు చిత్ర మొండు రచించి సంఘజిత్తును మెప్పించెను.

మహారాజుల రాక మూఁడు దినము లున్న దనఁగా సంఘ జిత్తునకుఁ జేరిన వార్తలవలన మహారా జెప్పటివలెఁ జిన్న పరివారముతోఁ గాక పెద్దయెత్తున దండయాత్ర పోవుచున్నట్లు వచ్చుచుండె నని తెలియవచ్చినది. మహారాజుల యంతఃపుర జన మంతయుఁ గదలి వచ్చుచుండెను. వారి యనుఁగుఁ దమ్ముఁడు కుబ్జ విష్ణువర్ధనుఁడు తన రాణులతోఁ జనుదెంచు చుండెను. మంత్రులు దండనాథులు నగరపాలకులు చారులు వచ్చుచుండిరి. చతురంగబలములతో మహాసేనయే వచ్చు చున్నది.

ఈ వార్త తెలియఁగనే సంఘజిత్తునకు సంభ్రమము కలిగి, ముందుగనే యమూల్యము లగు బహుమానములతో మహారాజులకడకు దూత నంపి, సంఘారామ మున్న పర్వతము చిన్న దనియుఁ దమ పేదమందిరము లిందఱు పెద్దలకు సగౌరవముగా నాతిథ్య మీయఁ జిన్న వనియు వినయ సంభ్రమములతో విన్నవింపఁజేసెను.

మహారాజాదూత నాదరించి యాతఁడు తెచ్చిన కానుకలు పరిగ్రహించి, వానికి దశగుణముగా సంఘారామమునకు బహూకృతు లర్పించి యిట్లు ప్రతివచన మంపెను:

"భిక్షువు లైన మీకు మా కాతిథ్యము నీయ నవసరము లేదు. మీ శుభాకాంక్షలే మాకుఁ బదివేలు. మా కవసర మైన వస్తుజాల మంతయు మా వెంట నున్నది. మా పరివార మీ వైపున నున్నంతకాలము వాఘిరానదీ జలములు పర్వతము దిగునంతవఱకుఁ గశ్మలము చేయకుండఁ గఠినముగాఁ గట్టడి చేయుచున్నాము. మా మర్యాదలకు మీరు కలఁత చెందవలదు!"

మహారాజుల ప్రతివచన మందుకొని సంఘజి త్తూరకించుక తేఱికొనెను. ఐనను, మహారాజక్కడ నెన్నిదినము లుండునో, యేమి లోపములు సంభవించునో, యని దిగులు పడుచుండెను. కాని మహారాజు పరివారము సంఘారామమున కెట్టి యొత్తిడియుఁ గలిగింప లేదు.

రాణువ కదలిపోవుచున్నట్లే పెద్దయెత్తునఁ బటకుటీరములు ఖరములు బండ్లు బలీవర్దములు ఉష్ట్రములు అశ్వములు గజములు వచ్చినవి. ఆ చుట్టు పట్టుల నరణ్యప్రదేశములో నక్కడక్కడఁ జెట్లు తక్షకులు నఱికివేయఁగా, మాపకులు కొలతలు వేసిపోవ, స్థపతులు నివాసములకుఁ గ్రీడలకు భోజనశయనాసనాదిసౌఖ్యములకు మందిరములు మహానగరమునవలె రెండు దినములలో నిర్మించిరి.

కొలఁదిమంది పెద్ద యుద్యోగులు తప్ప, సంఘారామ పర్వతముపైఁ గాని, దాని యెదుట నున్న మహాపర్వతమునఁ గాని, నివాసము లేర్పఱచుకొనలేదు. అర్ధచంద్రాకృతిగ నున్న సంఘారామపర్వతము సమస్తము కనఁబడు నున్నత్రప్రదేశమున, నెదురుగా నున్న పర్వతముపైఁ గుబ్జ విష్ణువర్ధనుఁడు సహస్రాక్షు నట్లు తన పటకుటీరము నిర్మించుకొనెను.

గుహారామను లన్నియు మహారాజక్కడికి వచ్చిననాఁడే శీఘ్రగతి దర్శించి వచ్చెను. ఆ నాఁడే యచ్చటి విద్యాశాలలు వైద్యశాలలు అతిథిశాలలు గోష్ఠములు స్థపతుల శిల్పుల చిత్రకారుల సేవకుల నివాసము లన్నియుఁ జూచి వచ్చెను. మహారాజేదేని దర్శింపఁ బోవునుముందా ప్రదేశము భటులు పరీక్షింతురు; పిమ్మట రాజపురుషులు చూతురు; ఆ పిమ్మట తమ్ముఁడు కుబ్జవిష్ణువర్ధనుఁడు దారి తీయుచుండ మహారాజు దర్శించుచుండును. మహారాజు వెనుకనే ప్రధానదండనాథుఁ డనుసరించుచుండును. ఈ పటాటోప మంతయుఁ గాంచిన సంఘారామ

భిక్షువులలో సేవకులలో భయోద్వేగములు కలిగినవి. మహా రాజు వేదమతాభిమాని యని ప్రతీతి. సరిపడనివా రెవరో సంఘారామముపై నిందలు మోపి వేగులు చేర్చియుండుటచేఁ బరీక్షించి నెపమెంచి, శిక్షించుటకే యిట మహారాజు వచ్చె నని వారిలో గుసగుస లారంభించినవి. ఐనను మహారాజెక్క డను ముఖము చిట్లించినట్లుగూడ లేదని గమనించుటచే వారికి ధైర్యము చేకూరుచున్నది.

ఆ మఱునాఁటినుండి మహారాజు పూఁట కొక గుహా రామము వంతునఁ బ్రత్యేకముగాఁ బరిశీలింపసాగెను. అట్లు పరీక్షించుచు రెండువారము లక్కడనే పరివారముతో నిలిచి పోయెను.

ఆ పరిశీలన కడు నిశిత మైనది, నైపుణ్యము కలది. గుహా రామము దర్శించు సమయములలో నశోకుఁడే మహారాజులకు మార్గదర్శకుఁడుగ నుండెను. మహారాజు వేదమతాభిమాని యైనను, బుద్ధభగవానుని శ్రీమన్నారాయణుని తొమ్మిదవ యవతారముగా భజించు భక్తుఁడు. మహారాజులకు సమ్మతము కానిది బుద్ధభగవానుఁడు కాదు. గౌతమబుద్ధ బోధ లను నెపమున, భగవానుని ధర్మప్రవర్తకులము మేమే యని ప్రక టించుకొనుచు, వేదవిరుద్ధాచారములు కర్మలు బోధించువారి బోధలే యాతని కిష్టము కానిది. బౌద్ధు లిప్పుడు చెప్పు చున్నట్లు భగవానునకుఁ బూర్వజన్మము లుండుటయు నాతనికి సమ్మతము కాదు. జాతకకథ లాతని కళ్ళయెదుటనే కవు

లయు కథకులయు నుత్సాహాతిశయముచే మార్పు లందుచుండుట, క్రొత్తవి పుట్టుచుండుటయు స్వయముగా నెఱింగియున్నాఁడు. అనాదిగా దేశములోఁ బ్రచారములో నున్న వేదోక్తకథలు పురాణకథలు నిజాతకకథల పేరుతో నూతనార్థములు స్ఫురింపఁ జేయుచు నూతనరూపము లందుచుండుట మహారాజు గమనించెను. ప్రజలలో మున్నెన్నఁడు లేని పరస్పరవిద్వేషము ప్రేరేపించు కథలు కొన్ని ప్రచార మవుచుండుట యాతనికిఁ గంటగింపుగ నున్నది.

సూక్ష్మము లెన్నియో మహారా జెఱింగియుండుటచే నంతకుఁ బూర్వము మూఁడువందల సంవత్సరముల క్రిందటఁ బ్రచారములో నున్న సంప్రదాయమున కేమాత్రమున్నా వైవిధ్య నక్కడి ప్రతిమకాని, చిత్రము కాని ప్రదర్శించుచున్నచో, మహారాజది యేసంప్రదాయ మనుసరించు నని వెంటనే ప్రశ్నించును. చక్కని చిత్రముల మధ్యఁ బొసఁగని చిత్రము కనఁబడి నంతనే యాశ్చర్యముతో నిదియే మని మహారా జడుగును.

"చిత్రరచన చేతకాని భిక్షువు తనకుఁ బెత్తన మున్న యహంభావము పురస్కరించుకొని చిత్రించి గోడయంతయు రంగులతోఁ బాడుచేసెను, మహాప్రభూ!" యని వెంటనే యశోకుఁడు సమాధాన మిచ్చెను.

"దానిని దుడిచివేయరాదా?" యని మహారా జడుగఁగా, నశోకుఁడు వినయముతోఁ గలసిన చిఱునవ్వుతో, "అంతపని

చేసిన నన్నీ భిక్షువులు పాతిత్యము కట్టుకొంటి వని బహిష్క-రింపరా, ప్రభూ!" యని విన్నవించును.

ఇట్లే చిత్రరచనము, ప్రతిమాకల్పనము, గుహావిహార నిర్మాణము, నిత్యాదికవిషయములు మహారా జడిగి తెలిసికొనుచుండెను. కొంత పనిచేసి యాపిన గుహలఁ గూర్చి యీ పని యెందుల కాగిపోయిన దని మహారాజు ప్రశ్నింప నీళ్ళు నమలుచుఁ జిత్రకారుఁ డిట్లుత్తర మొసంగెను.

"మహారాజా, అది యెన్నఁడో జరిగినమాట. విశదముగాఁ గారణ మిదమిత్థమని చెప్పఁజాలము. ఈ గుహారామము తొలిపింప నాజ్ఞాపించిన రాణి యది యారంభించిన కొలది కాలముననే కాలధర్మము నొందిన దందురు. అదిగాక దీనిలో శిలాదోషము కొంతలోఁతునకుఁ బోయిన తరువాతఁ గనిపించినది. మహారాజు చూడవలె నని యనుజ్ఞయిచ్చిన గునప ముతోఁ గొట్టి బోలుమోఁత ప్రదర్శింపఁ గలను. ఇదిగో-!" యనుచు మహారాజానుమతితోఁ బలుగు తెప్పించి కొట్టి శబ్దభేదము ప్రదర్శించెను. ఇట్లే యితరగుహల లోపముల నతఁడు మహారాజులకు విశద మొనర్చెను.

"మహారాజా, ఈ గుహ తిలకింపుఁడు. ఇది వట్టి సున్నపు ఱాయి కొంత, గునపముల కెదురు తిరుగు వజ్రమువంటి కఠిన శిల కొంత. బీఁటలు నెఱ్ఱెలు పడి యిది గుహా నిర్మాణమునకే మాత్రము పనికిరానిది. దీని నారంభించిన స్థపతికి శిలా స్వరూపము తెలిసినట్లే తోఁపదు.- ఈగుహారామ మట్టిదికాదు.

ఇందులోఁ గొంతదూరము త్రవ్విన పిమ్మట జలమూరుటచేఁ బనికిరా దని వదలివేసినాఁడు స్థపతి!—"

అశోకుని వివరములు వినుచు మహారా జన్ని గుహారామములును దర్శించి చివరకు నూతనముగా నిర్మించి యశోకుఁడే స్వయముగా నలంకరించుచున్న గుహారామమును దర్శింపఁ బోయెను. అది యన్నిటికంటెఁ దూర్పుచివర నున్నది.

## 11

తాను తొలిపించి నిర్మించి స్వయముగాఁ జిత్రరచన చేయు చున్న గుహారామమును మహారాజులు దర్శింపఁ బోవుచుండ, నశోకుని కొకవంక సంతోషము నింకొకవంక నుద్వేగము నావేశించినవి. అదిచూచి సహృదయులైన మహారాజు లే మనుకొందురో యని యాతఁ డెఱుంగ నుత్సాహము భయము పొందసాగెను.

ఈ గుహారామము దర్శించినప్పుడు మహారాజు వెనుకటి వలె నశోకు నేమియుఁ బ్రశ్నింపలేదు. ముందు దాని ముఖ మందిర విశిష్టత చూచి మహారా జించుకసే పాగి స్పష్టముగా ముఖములోఁ బ్రీతి ప్రదర్శించెను. ఆ పిమ్మట ముఖద్వారము నుండి గర్భాలయములో ధ్యానముతో నర్ధనిమీలితలోచ

నుండై యున్న బోధిసత్త్వ విగ్రహముపై వెలుగు పుష్కల ముగాఁ బ్రసరించుట గమనించి, యశోకు నగ్గించి, "అది అవలోకితేశ్వరుని విగ్రహ మనియే యుద్దేశించితివా?" అని యడిగెను. 'చిత్త' మని యశోకుఁ డుత్తర మిచ్చుచు, నందులోఁ దాను సంప్రదాయసిద్ధమగు నవలోకితేశ్వర మూర్తిలోఁ దెచ్చిన చిన్నమార్పులు మహారాజు గమనించినాఁ డని గ్రహించెను.

అంతట మహారాజు గుహారామములోఁ బ్రవేశించి ముందు గుహానిర్మాణ విశేషములు సింహావలోకన మొనర్చెను. శిలలో నెందైన మెతకదన మున్నదేమో, అతికఠినశిల యున్నదో, పొలుపు లెక్కుడనైన నున్నవియో, నీ రెక్కడనే నూరుచున్నదో, మొదలగు విషయములు పరీక్షించి, లోప ములు లేమి గమనించి సంతుష్టుఁ డయ్యెను.

మరల రెండవమారు గుహాలయములోఁ బ్రదక్షిణ మొన ర్చుచు నందుఁ జెక్కిన శిలాప్రతిమలు స్తంభములు లతలు జంతువిన్యాసములు వేర్వేర శ్రద్ధగాఁ బరిశీలించెను. గర్భా లయమందలి యవలోకితేశ్వర మూర్తియెదుట భక్తితో నిలిచి నమస్కరించెను. "నీకు జన్మపరంపర యుడిగినది. నిర్వాణ మునఁ బ్రవేశింపు" మని శక్రాదు లర్థించినను, 'చతుర్దశ భువనములలో జన్మపరంపరలోఁ బడి యలమటించుచున్న జీవ కోటు లన్నియు నిర్వాణము ప్రాపించువఱకు, నేను నిర్వాణ మునఁ బ్రవేశింప'నని భీష్మించి నిలిచిన యాకృపామూర్తి

నెవరు సంభావింపకుందురు! ప్రేక్షకులను విశేష మాకర్షించు చున్న యొకతల గల నాలుగు జింకల స్తంభము చూచి, మహారాజు మందహాసము ప్రసరింపఁ జేసెను.

మహారాజు మూడవమారు గుహాప్రదక్షిణముప్రారంభించి యందలి చిత్రరచన పరీక్షింపసాగెను. పులకేశి వల్లభుఁడు తాను వైభవముగఁ గొలువు తీరి యుండ, విదేశములనుండి రాయబారులు దర్శనార్థ మరుదెంచి కానుక లర్పించుచున్నట్లు, క్రొత్తగాఁ జిత్రించియున్న చిత్రము గాంచి యంతరంగమున నెంతయుఁ బ్రీతుఁ డయ్యె, నశోకుని దానిఁగూర్చి యిట్లు ప్రశ్నించెను:

"ఈ జాతక చిత్రముల నడుమ నీ చిత్ర మెట్లు పొసఁగి యున్నది?"

అశోకుఁడు వెంటనే యుత్తర మిచ్చెను: "బౌద్ధధర్మము రక్షించుచున్న మహాప్రభువుల చిత్ర మీ గుహారామములోని యితరచిత్రము లన్నిటితోఁ బొసఁగి యున్నదని యే నామనవి!"

ఆ సమాధానము విని పులకేశివల్లభుఁడు స్పష్టముగా మరింత సంతుష్టుఁ డయ్యెను. అటనుండి యించుక సాగి చిత్రము వ్రాయ కున్న శూన్యప్రదేశము నిర్దేశించి, 'ఇక్కడ నేమి చిత్రింపఁ దలఁచితివి?' అని మహారాజు ప్రశ్నించెను.

అశోకుఁడు జంకుచు నిట్టుత్తర మొసఁగెను: "మహా ప్రభూ, ఇంకను స్ఫురింపలేదు. ఏనేమో యూహ లస్పష్ట ముగాఁ దోఁచుచు మాయమవుచున్నవి. స్థిరముగా రూపము

ప్రత్యక్షము కాలేదు. అది ప్రత్యక్షమైనచో నాపైఁ జిత్ర నిర్మాణ మొకటి రెండు దినముల పనిమాత్రమే !"

మహారాజు జెత్తిన తల దింపకయే మరలఁ బ్రశ్నించెను: "అయినచో ముందుగా గుహానిర్మాణము, అందలి చెక్కడపుఁ బనులు, చిత్రవిన్యాసము — సమస్తము భావనలో నిర్మించు కొనకుండఁగనే యీమహాకార్యమున కుపక్రమించితివా?"

ఇంచుక యవనతవదనుఁడై యశోకుఁ డిట్లుత్తర మొసఁగెను: "ప్రభూ, తమరు సెలవిచ్చినట్లు మొత్తముమీఁద నంతయు ముందుగనే భావనలో నిర్మించుకొంటిని. ఐనను నిర్మాణము ప్రారంభించిన తర్వాత సమస్త విషయములలో మార్పులు చేయుచుండుట యవసర మైనది. మాగురువులు చెప్పుచుండు మాట లిప్పు డనుభవములోనికి వచ్చినవి."

పులకేశి : మీ గురు వెవరు ?

అశోకుఁడు: సంఘారామాధ్యక్షులు తపస్సు చేసికొను గుహారామమునకుఁ బశ్చిమముగా నున్న గుహాలోఁ దపస్సు చేసికొనుచున్న వృద్ధభిక్షువులు, ప్రభూ ! గంభీరమనోజ్ఞమైన యీ గుహారామము వారే తొలిచి యలంకరించిరి.

అంతకు మించి యేమియు మహారాజు మాటాడకున్నను, ఎక్కడ నేమి చిత్రము వ్రాయవలెనో నిర్ధారణము చేసికొనక పని కుపక్రమించుట భావ్యము కాదని సూచించు చూపులతోఁ దిలకించుచున్నట్లుగా నశోకుఁడు గమనించి, విషయవివరణ

మునకై మాటలు తడవికొనసాగెను. తుద కాకస్మికముగా గురువాక్యములు స్మరణకు రాఁగా నిట్లు విన్నవించెను:

"వీరాధివీరు లగు మహాప్రభువులకు స్థపతుల మగు మా కష్టము మఱియొకతీరున విన్నవించుకొందును. మా కీ శిల బలశాలియగు శత్రువువంటిది. మహాయుద్ధములలో శత్రు పరాజయమునకు సేనాపతులు ముం దెన్నియో వ్యూహములు రచించి యున్నను, ప్రత్యక్షముగా రణరంగములో నెప్పటి కప్పు డెన్నియో మార్పులు చేయవలసి వచ్చుట మహారాజుల కనుభవసిద్ధమే యని భావింతును. అట్లే స్థపతుల మగు మాకును ఈ శిలావిజయము! మా కీ శిల యెప్పటి కప్పుడు క్రొత్తచిక్కులు తెచ్చిపెట్టుచుండును. జనులు తలంచున ట్లీశిల నిర్జీవమైనది కాదు. దానికిఁ దఱుగు విఱుగు లున్నవి. నిద్రాసమయములు జాగ్రత్సమయములు కలవు. ముందది తీవ్రముగాఁ బ్రతిఘటించి నిరాశ పుట్టించును. అంతలో శిథిల మై కూలిపోయెద నన్నట్లు బెదరించును. కొంత కాఠిన్యము కొంత బుజ్జగింపు దీనికిని గావలె! అశిక్షితమైన యశ్వరాజ మును వలె నీ శిలారాజమును స్వాధీన మొనర్చు కొందుము. వనమునుండి పట్టితెచ్చిన గజరాజును బలె ఈ శిలారాజ మును సాధింతుము మహారాజా!—"

విషయము స్ఫురించిన తర్వాత నశోకునికి మాటలు ప్రవా హమువలె వచ్చుచుండెను. అవి యాలించుచుఁ జిత్రకారుని యం దాదరాతిశయముతో మహారా జాలోచనలోఁ బడి

పోయి మానము వహించెను. ప్రక్కనేయున్న రాజసోదరుఁడు కుబ్జవిష్ణువర్ధనుఁడు వెంటనే యందుకొనెను. "నీవు చాల యుద్ధానుభవ మున్నవానివలె నున్నావే. ఏయే యుద్ధములలోఁ బాల్గొంటివి?"

"మహాప్రభూ, నేను చిత్రించిన యుద్ధచిత్రములు రెండే. ఒకటి భగవానుఁడు బుద్ధత్వము ప్రాపించిన వెంటనే మారు నిలోఁ గావించిన శాంతియుద్ధము. రెండవది అక్కడనున్న వృషభ యుద్ధము. అవి చిత్తగించితిరిగదా! అందులో నేను చూచిన దా వృషభయుద్ధ మొకటే. రెండవది నా మనస్సులో భావించిన యుద్ధమే. నేను చేసినవి, ఉలి, సుత్తె, సమ్మెట, కుంచె—ఈ సాధనములతోఁ జేసిన యుద్ధములే. ఈ గుహారామ శిలతో యుద్ధ మారంభించి యిప్పటికిఁ బదునైదేళ్ళు కావచ్చినది. ఇంకను బూర్తి కాలేదు!"

కుబ్జవిష్ణువర్ధనుఁ డంతటితోఁ దృప్తిపడక మఱి యెన్నెన్నో ప్రశ్నలు వేసెను. వెంటనున్న దండనాథుఁడు నందులోఁ దోడయ్యెను. పులకేశి మహారాజులకు వార లశోకుని బాధించుట యిష్టములేక కాఁబోలు, ముందునకు సాగిపోయిరి. అశోకుఁడును వారి ప్రశ్నపరంపరనుండి తప్పించుకొని బయటఁబడి మహారాజు ననుగమించెను.

మహాజనక జాతక చిత్రములు చూడకయే, సరాసరి మహారాజు పద్మపాణి చిత్రము నెదుట నిలిచి దాని వైభవము తదేక దృష్టితోఁ దిలకింపసాగెను. ఆ చిత్రమును బరివేష్టించిన సమస్త

భువనములందలి జీవరాసుల యానంద పారవశ్యము గాంచుచు పులకేశి యానందపరవశుఁ డయ్యెను. అట్లది తనివితీఱఁ జూచి చూచి మహారా జశోకుని నిట్లడిగెను :

"మఱి యిది పద్మపాణి బోధిసత్త్వుని చిత్రమనియే యుద్దేశించితివా?"

"చిత్తము, ప్రభూ!"

"అట్లైనచో నుష్ణీషములో అమితాభ బొమ్మ లేదేమి?"

అశోకుఁ డించుక చిక్కునఁ బడెను. మహారాజు చిత్ర సంప్రదాయము చక్కగా నెఱిఁగియే ప్రశ్నించెను. అశోకుఁడు తెలియక చేసిన మార్పుకాదు. అతఁ డిట్లు సమాధాన మొసఁగెను.

"మహాప్రభూ, తమరు సర్వజ్ఞులు. ఆ చిత్రము నాకు భావనలో భాసించినపుడు అమితాభ లేకుండఁగనే ప్రత్యక్షమైనది. ఉష్ణీషములో నమితాభచిత్ర మెన్నివిధముల నిముడ్చుటకు యత్నించినను గుదురలేదు. ఆ చిత్రము పద్మపాణి ముఖవర్చస్సును మఱుగుపరప సాగినది. చిత్రకారుల కున్న స్వేచ్ఛ నవలంబించి యీ విధముగాఁ జిత్రించితిని. ఆ కిరీటములో రత్నమే యమితాభగా భావింపవచ్చును. కాకున్న నీ నీలరాజ్ఞిచిత్రము అమితాభ శక్తియని గ్రహింపవచ్చును!"

మహారాజు దృష్టి వెంటనే 'నల్లరాణి' చిత్రముపైఁ బ్రసరించెను. గుహారామము ప్రదక్షిణించి వచ్చిన రెండు పర్యాయములును మహారాజు నా చిత్ర మాకర్షించియే యున్నది.

ఐన నది సమయము కాదని యప్పటికి దానిపైనుండి తన దృష్టి మరల్చుకొని, దాని స్వరూప మిప్పుడు చిత్రకారునివలనఁ దెలిసికొని, మహారాజు దానివంకఁ దదేక దృష్టితో నానంద తన్మయుఁడై చూడసాగెను. అట్లు చూచి చూచి యశోకుని బహుమాన మంద రమ్మని సంజ్ఞచేయఁగా, నాతఁడు వినయముతో మహారాజుముందు మోకరించెను. మహారాజు తన మెడలోని ముత్యాల కంఠహారము తీసి యశోకుని కీయఁగా, నాతఁడు మహాప్రసాద మని గ్రహించి, కన్నుల కద్దుకొని, నమస్కారపురస్సరముగా నది శిరస్సున నుంచుకొని యిట్లు మనవి చేసెను.

"ప్రభూ, ఈ బహూకృతికి నేఁ దగను!"

"ఏల ?"

"మహాప్రభూ, ఈ చిత్రము నేను వ్రాసినది కాదు!"

"మఱి యెవరు వ్రాసిరి ?"

"అదే నాకు నిర్ధారణ కాలేదు. నేను నమ్మలేకున్నాను గాని నా యైదవకుమారుఁడు వ్రాసి నట్లు తోఁచును."

మహారాజాజ్ఞచే నశోకుఁడు కొండప నచ్చటికిఁ బిలిపించెను. మహారాజు సన్నిధానమున నెట్లు ప్రవర్తింపవలెనో యెఱుఁగ నందున, బెరుకుతోఁ గొండప యచటికి వచ్చి, మహారాజులకు నమస్కారమైనఁ జేయక పండ్లికిలించుచు నిలిచెను. ఆ కుబ్జివాని పెద్దనోరు, నికిలింపు, తెలివితేటలు వ్యక్తము కానిముఖభంగి—సర్వము చూచుచు నితఁ డెవరని మహారా జడిగెను.

"ఇతఁడే యాబొమ్మ వ్రాసిన నా కుమారుఁడు కొండప, మహాప్రభూ !"

అశోకుని మాటలు మహారాజు నమ్మలేక పోయెను. తన బండకుమారునిపై ననుగ్రహము ప్రసరింపఁజేసికొనుటకై శిల్పి యబద్ధమాడుచున్నాఁడని మహారాజులకు సంశయలేశ ముదయించి నట్లున్నది.

"ఒరే, నీవేనా యాచిత్రము వ్రాసినది ?"

కొండప తడఁబడుచు, "ఏమో, తెలియదు. వాఘిరా నీవే వ్రాసినా వనుచున్నది" అనెను.

"వాఘిరా యెవరు ?"

"భగవానుని ప్రసాదము !"

# 12

ఆమాట లెంతమాత్రము తన కర్థము కానట్టి చూపుతో మహారాజు అశోకుని వంకఁ దలయెత్తి చూడ, నాతఁ డిట్లు వివరించెను !

"మహాప్రభూ, ఈ సంఘారామములో వాఘిరాయను పిల్ల పెఱుగుచున్నది. అది చిత్రమైన పిల్ల. అది భగవానుని ప్రసాదమని యిక్కడ మా యందఱి విశ్వాసము. అది వీనితో మైత్రి

నెలవు చుండును. దాని నెదుట నిలువఁబెట్టి ఈ కుబ్జవాఁడీ బొమ్మ చిత్రించెను. దానిని జూచుచున్న యావేశము వల్లనే తా నీ బొమ్మ వ్రాయఁగలిగితినని ఈ కుబ్జవాని విశ్వాసము. సరిగా దాని చూపే యిందులోఁ జిత్రించినాఁడు—".

వెంటనే మహారాజాపిల్లను జూడవలెనను కుతూహలము వ్యక్తపఱచెను. ఆ పిల్ల భయభక్తులు లేకుండఁ బెఱిగిన దగుటచే మహారాజుల కాగ్రహము కలిగించు పను లేమి చేయునో, ఏ మనునో యని, దాని నిన్నాళ్ళను సంఘజిత్తు మహారాజులకుఁ గనఁబడకుండ, నతికష్టము మీఁద నెట్లో తన గంధకుటిలో దాచి యుంచెను. అందుచే నశోకుఁడు పోయి వాఘిరాను జూడ మహారాజు లిచ్ఛగించుచున్నారని చెప్పఁగనే సంఘజిత్తు తెల్లవోయెను.

"అయ్యో, వాఘిరా సంగతి మహారాజుల కెవరు చెప్పినారు ?"

అశోకుఁడు సంగతి సందర్భములు వివరింప, సంఘజిత్తునకు దిగులు పుట్టినది. కర్తవ్యమేమి ? ఆపూఁట కది యస్వస్థముగానున్నదని సాకుచెప్పి తప్పించెను. కాని యా మధ్యాహ్నమునఁ బంపక తప్పినది కాదు.

అత్యద్భుతముగా నున్న యాగుహారామమును, విశేషించి యందులోని పద్మపాణిచిత్రమును, 'నల్లరాణి' చిత్రమును, జూచి యానందించుటకా మధ్యాహ్నమున మహారాజు తన పట్టమహిషిని గూడఁ దెచ్చెను. 'నల్లరాణి' చిత్రరచన

వృత్తాంతము వినినంతనే మహారాజ్ఞి కూడ వాఘీరాను జూడవలెనను కోరిక ప్రకటించినది. ఇంకే మున్నది? చిత్రకారునికిఁ బోక తప్పలేదు. సంఘజిత్తునకుఁ బంపక తప్పలేదు. బోనులోనుండి విడివడిన పులిపిల్లవలెనే వాఘీరా మహారాజు కడకు వచ్చినది.

ఇన్నాళ్ళను దన్నేల ఎక్కడికిఁ బోనీయకుండ నుంచిరో దాని కర్థము కాలేదు. ఇప్పుడు వదలినంతనే, పట్టరాని రోషముతోఁ బొంగిపోరలి వచ్చుచున్న దుఃఖముతో, దుసుసుగా వచ్చినది. అది భిక్షువులను, శిల్పులను, జిత్రకారులను, సంఘారామమునకు సామాన్యముగా నరుదెంచు భక్తులను మాత్రము చూచి యెఱుఁగునుగాని మహారాజులను రాణులను జూచి యెఱుఁగదు. ఉత్సవసమయములలో కొందఱు రాజు లక్కడికి వచ్చు నాచార మున్నను, ఉత్సవము లన్న నే యిష్టములేని వాఘీరా తిరునాళ్ళలో సమీపారణ్యమునఁ బొద్దుపుచ్చి వచ్చుచుండుటచేఁ జూచియుండ లేదు.

అంత రోషముతో దుసుసుగా వచ్చిన వాఘీరా యక్కడ మహారాజును రాణిని జూచి నివ్వెఱపోయినది. వారల సౌందర్యము, గాంభీర్యము, తేజస్సు, విశిష్టవేషములు, వారలయెడ నితరు లందఱుఁ జూపుచున్న గౌరవము- అన్నియు నేకమై వాఘీరాకుఁగూడ వారలయెడ గౌరవభావము కలిగించినవి. వారందఱు కొండప చిత్రించిన 'నల్లరాణి' బొమ్మ ముందుండుటయు, నక్కడనే కొండప యుండుటయుఁ జూడ,

దానికి వీరందఱుఁ గలసి కొండప నా బొమ్మ వ్రాసినందులకు శిక్షింప నున్నారను భయ మావేశించినది. నీరు గిఱ్ఱునఁ దిరుగు చున్న కన్నులతో నది దీనముగాఁ దలయెత్తి, రాణివంకఁ జూచుచు మోకరించి, కొండపపైఁ గోపింపవద్దని బ్రతిమాల సాగినది.

"తల్లీ, కొండప తప్పులేదు. మీ నాన్న యిన్ని బొమ్మలు వ్రాసి గోడలు నింపునే, నీ వొక్కటి యీ శూన్యప్రదేశ ములో వ్రాయలేవా, యని యెన్నియో మాఱు లాతని నేఁ గవ్వించితిని! నీ వెదుట నిలుచున్న నెట్లు వ్రాసెదనో చూడు మని యూతఁడు నాతోఁ బందెము వేసెను. ఆనాఁడు నే నాతని నిక్కడికి రహస్యముగా లాగికొని వచ్చి, యిక్కడ నిలుచుం టిని. బొమ్మవేయు మని రోషము తెప్పింపఁగా నాపోరు పడఁ జాలక అది వాఁడు వ్రాసినాఁడు. తండ్రి చూచిన నెక్కడ కోపించి చంపిపోవునో యని చకచక వ్రాసినాఁడు. వాని తప్పు లేదు. తప్పంతయు నాది!"

అమాయిక మయిన దానిమాటలు విని రాణి ముచ్చట వడి, 'అమ్మాయీ, నీ వానాఁ డెట్లు నిలుచుంటివో చూపు' మనఁగనే, సరిగా నట్లు నిల్చి చూపినది. కొండప తల వంచు కొనెను. అశోకుఁడు విస్మయముగ్ధుఁ డైనాఁడు. మహారాజ్ఞికిని మహారాజులకును వాఘిరాయెడ విశేషప్రసన్నభావ ముద యించినది. చిఱునవ్వుతో రాణి యిట్లనినది:

"అమ్మాయీ, నీ వొక పనిచేయుట కొప్పికొందువేని, నీ మిత్రుని శిక్షింపము. సమ్మతింతువా ?"

"అమ్మా. పాప మతని తప్పులేదు. అతని శిక్షింపని పక్షమున నే నెంతటి శిక్షకైనఁ దల యొగ్గెదను."

"నిజమా?"

"బుద్ధభగవానుని యాన! నిజము !"

"సరే, నీ మిత్రు నిదే శిక్షింపక వదలితిమి. నిన్ను మా యంతఃపురములోనికిఁ దీసికొనిపోయి యక్కడ నీకుఁ జదువు ఆటపాటలు శిక్షింపఁ జేసెదము, వచ్చెదవా ?"

"చిత్తము, తల్లీ ! కొండపను శిక్షింపరు గదా !"

వెంటనే మహారాజ్ఞి వాఘిరాను తనవెంట నంతఃపురమునకుఁ గొంపోయినది. అక్కడ దానికి సర్వసౌఖ్యములు రాణి యమర్చినది. అనుదినము నాపిల్ల రాణిని, 'నాకుశిక్ష యెప్పుడు విధించెదరు ?' అని ప్రశ్నించును. 'వాతాపికి వెళ్ళిన తరువాత' నని రాణి యుత్తర మిచ్చును. అట్టి మహారాజ్ఞి చేతులలో శిక్షనొందుట యొక మహాభాగ్యముగనే వాఘిరాకుఁ దోఁచి నట్లున్నది. అది తన శిక్షకై తొందరపడసాగినది.

అక్కడనుండి మహారాజు రాణువతోఁ గదలిపోయి తలపెట్టిన విజయ యాత్రలు పూర్తిచేసికొని, యాఱునెలలకు రాజధాని యగు వాతాపి చేరికొనెను. వారి వెంట వాఘిరాను వాతాపికిఁ దీసికొని వెళ్ళిరి.

# 13

వాఘిరా యంత యాకస్మికముగా రాణి యంతఃపురము చేరిన వార్త తెలిసినంతనే కుమారశ్రీ కలవరపడెను. సెలయేటి వలె స్వేచ్ఛగా సంచరించు వాఘిరా యంతఃపుర నియమములు పాటింపలేక నిదాఘ సమయమున సెలయేటివలెనే యెండి పోవునని కుమారశ్రీనాథుని భయము. అదిగాక యది తనకు భగవానుఁ డనుగ్రహించిన ప్రసాదమాయెను! అది సంఘారామమును విడిచిపోవుట తనకే కాక సంఘారామమునకే క్షేమము కాదని యాతనికి భయమైనది. చేతులార భగవత్ప్రసాదము వదలుకొనుచుంటి మని దిగులు పుట్టినది. ఎట్లైనను రాణి వాఘిరాను దీసికొని పోకుండఁ జేయ నతఁ డెన్నియో ప్రయత్నములు చేసెను. తుదకు మహారాజు రాణువతోఁ గదలి పోవుచున్న దినమున, భగవానుని ప్రసాదమును సంఘారామమునుండి కదలించుట శుభము కాదని మహారాజులకు విన్నవింప వార్తాహరునిఁ బంపెను.

కుమారశ్రీ ప్రయత్నము లన్నియు సంఘజిత్తు వ్యర్థము లొనర్చెను. తుదకు సంఘాధ్యక్షుఁ డంపిన వార్తాహరుని మహారాజుల దర్శింపకుండఁ గూడఁ జేసెను. కుమారశ్రీనాథుఁడు వార్ధక్యముచే మతితప్పి యనుచిత కార్యము లొనర్చుచున్నాఁడని, తన కప్పుడు తాత్కాలికముగా సంక్రమించిన పెద్దఱికము నవలంబించి, కుమారశ్రీప్రయత్నము

లన్నియుఁ గొట్టువడఁ జేయఁగలిగెను. మహారాజ్ఞికి విప్రియ మేమాత్రమేని కలిగించుట సంఘజిత్తునకు సమ్మతము కాదు. ఈ విధముగా వాఘిరా వదలిపోవుటచే సంఘారామనియమము లిఁక సక్రమముగా సాగఁగల వనియు నాతఁడు సరిపెట్టుకొనెను. ఈ సందర్భములో సంఘాధ్యక్షు లగు కుమారశ్రీనాథులకు వాఘిరాను దమవెంటఁ బంపుట సమ్మతము కాదని సూచన ప్రాయముగా నైన మహారాజులకును రాణికిని దెలియనే లేదు.

తా నంపిన వార్త మహారాజుల కందలేదని కుమార శ్రీనాథుఁ డెఱుఁగఁడు. పూజ్యమైన సంఘారామాధ్యక్షుల యిచ్ఛ నుల్లంఘించి, భగవత్ప్రసాదమును మహారా జెత్తుకొని పోయె ననియే కుమారశ్రీ తలంపు. "అవసానమున నిది మహారాజులకు శుభముకాదు! శుభముకాదు!" అని పలుమాఱు కుమారశ్రీనాథులు గొణిగికొనుచుండుట యిప్పుడు సామాన్యమైనది.

వాఘిరా వెళ్ళుటచే నశోకుఁ డేమియుఁ జింతింప లేదు. పట్టమహిషి యనుగ్రహమున వాఘిరా యదృష్టము పండిన దనియే యాతని యూహ.

వాఘిరా వెళ్ళిన దాది కొండప ప్రవర్తన మంతకంతకు విచిత్రము కాఁదొడఁగెను. పిచ్చివానివలెఁ దాను వాఘిరాతో నాటలాడిన కొండలఁ గోనల నడవుల నేదో పాఱవేసికొనిన వస్తువు వెదకుచున్నవానివలెఁ దిరుగాడు చుండెను. చలితో నోడలు బిగిసికొని పోవువఱకును, ప్రవాహవేగమున కంగము

లన్నియు నిస్సారము లగు నంతవఱకు, నతఁడు తఱచుగా వాఘిరా నదీజలముల నీదులాడును. ఆ స్నానమునకు వేళ పాళలు లేవు. గుబులుగా వాఘిరాను జూడవలె నని యెప్పుడు తోఁచిన, నప్పుడే యాతఁ డావాఁగు నీటిలో దిగును. దాని కర్ధరాత్ర మని లేదు, అపరరాత్ర మని లేదు. నామసామ్యమున నా నది తన నెచ్చెలిగా నాతనికిఁ దోఁచుచున్నది.

ఆతఁ డాహారనిద్రలు సరిగాఁ జేయుట మానివేసెను. ధారణీమాయి యెంత యాదరముతో నాతని బుజ్జగించిన నామె మాటలు చెవిఁ బెట్టఁడు. ఆమె ప్రశ్నలకు బదులు పలుకఁడు.

కొండప విచిత్రప్రవర్తన మశోకుఁడు గమనించెను. చిత్రకారులకు యౌవనప్రాదుర్భావ సమయముల నట్టిది క్రొత్తకాదని యాతఁ డనుభవ పూర్వకముగా నెఱుఁగును. తన కుమారుఁడు మహాచిత్రకారుఁడు కాఁగలఁడని యాతని యాశ. తా నెఱిఁగిన విద్య యంతయుఁ గుమారునకు నేర్పుట కాతఁ డెంతయు యత్నించును. కొండప మనస్ఫూర్తిగాఁ బనిచేయ నొల్లఁడు. ఆతని యద్భుతశక్తి గుర్తెఱిగి యుండుటచేఁ దండ్రి యాతని నొత్తిడి చేయఁడు, కోపింపఁడు, బుజ్జగించి బోధించును. అది కొండప నెత్తి కెక్కించు కొనఁడు.

కొండపకు హృదయభారము దుర్భరముగా నున్నపు డాతఁడు కుమారశ్రీ సన్నిధి కేగి దీనముగా విలపించును. కుమారశ్రీ యాతని నోదార్చును. ఆ భిక్షువు యౌవనము నాటి పూర్వస్మృతు లన్నిటిని దనరాకచే వాఘిరా పెల్లగించు

చున్నను, హృదయమున కది చల్లదనము కూర్చెడిది. వాఘిరా యిప్పుడు దూరమగుటచే నీమధ్య బహు సంవత్సరము లెఱుఁగని బాధయొకటి మరలఁ గ్రొత్తదై యాతని వేధింపసాగినది. అయిన నాతఁడు చిరకాల సాధనచే నాత్మనిగ్రహ మభ్యసించినవాఁ డగుటఁ దన బాధ నంత బయటికిఁ గనఁబడ నీయఁడు. మధ్యమధ్య "పర్యవసానమున మహారాజున కిది శుభముకాదు, శుభముకాదు!" అని గొణుగుచుండు నపు డాతని దేహమంతయు గాలికి చలపత్రమువలె చలించిపోవుట తప్ప ఇతర బాహ్యలక్షణములు కాన్పింపవు.

కొండప యొకనాఁడు కుమారశ్రీ యొద్ద కేగి, యెప్పటికంటె నెక్కువగా నేడువ మొదలుపెట్టెను. కుమారశ్రీ యాలోచించి, "నీవు మహారాజు కొలువు సంపాదింపరాదా? నీకుఁ బరిచయపత్ర మిత్తును" అనెను.

కొండపకుఁ గొండయెక్కిన ట్లయినది. అంతవఱకు నాతనికి వాతాపి వెళ్ళి వాఘిరాను జూచిరావలె నని యైన స్ఫురింపలేదు. వెంటనే యాతఁ డిప్పుడా పరిచయ పత్రిక తీసికొనెను. అందులో నధ్యక్షుఁడు, "ఇతఁడు మా సంఘారామమునఁ జిత్రకారుఁడు. రాజమందిరము నలంకరింపఁగల ప్రజ్ఞ యీతని కున్నది" అని వ్రాసి చేవ్రాలు పెట్టి బోధిద్రుమముద్ర వేసి కొండప కిచ్చెను. కొండప వికసించిన మొగముతో నాపత్ర మందుకొని కన్నుల కద్దుకొని, కుమారశ్రీనాథుని యొద్ద సెలవుగైకొనుచుఁ దొందరలో

వందనమైనఁ జేయుట మఱచి, యటనుండి తల్లిదండ్రుల సెలవు తీసికొనఁబోయెను.

తన పిల్లలకు భర్తకు నెదురాడుట యెఱుఁగని ధారణీమాయి యాతనిఁ గన్నీటితో దీవించి సెలవిచ్చి పంపుచు నక్కడ వాఫిరా సహవాసము చేయవద్దని మఱిమఱి యాదేశించెను.

అశోకుఁడు కుమారుని యుల్లాసవైఖరి కనిపెట్టినాఁడు. ఆతఁడు వాఫిరా సాహచర్యమునకే రాజధానికిఁ గదలుచున్నాఁడని పసికట్టినాఁడు. ఏమైన నీ విధముగాఁ దన ప్రియపుత్రుఁడు రాజప్రాసాదము నలంకరించి ప్రసిద్ధుఁడగు నని సంతోషముతో నాశీర్వదించి పంపెను. అట్లు పంపుచు నతనికి రహస్యముగా నుత్తమతూలికల నిర్మాణము, వర్ణములు మిళిత మొనర్చుటలో సూక్ష్మములు, రంగులు స్థిరముగా శాశ్వతముగా నిలిచియుండుటకై చేయవలసిన ప్రయోగరహస్యములు నెన్నియో యుపదేశించెను.

# 14

పూర్వకాలమున దక్షిణాపథమున నిల్వలుఁడు వాతాపి యను నిరువురు రాక్షససోదరు లుండెడివారు. వారు మునీశ్వరుల నతిథులుగాఁ బిలిచి, వారిలో వాతాపి కామరూపి యగు

టచే మేషరూపమున నతిథుల కడుపులలోఁ బ్రవేశించి, పిమ్మట నిల్వలుఁడు పిలిచి నంతనే యా మునుల పొట్టలు వ్రక్కలు చేసికొనుచు బయటికి వచ్చుచుండెడివాఁడు. ఆసోదరులీ యాటనే తేజశ్శాలి యగు నగస్త్యమహర్షికడ సాగింపఁ జూడ, నగస్త్యుఁడు మేషరూపమున నున్న వాతాపిని భక్షించి త్రేచి 'జీర్ణం జీర్ణం వాతాపి జీర్ణమ్' అన్నంతనే, వాతాపి యాతని కుక్షిలో జీర్ణమయ్యెను. ఇల్వలుఁడు విజృంభింప నాతని నగస్త్యమహర్షి తన దృష్టిమాత్రమున భస్మీభూతు నొనర్చెను. ఈ విధమున నగస్త్యుఁడు దక్షిణాపథము మునీంద్ర నివాస యోగ్య మొనర్చిన పుణ్యక్షేత్రమున, వాతాపినగరము వెలసి వేదమతాభిమానులగు మహారాజవంశముల రాజధానీ నగరమైనది. అక్కడ నగస్త్యమహర్షి ప్రతిష్ఠచేసిన యగస్త్యేశ్వరమూర్తి చాళుక్య ప్రభువుల కిష్టదైవము. ఆ మహర్షి ప్రతిష్ఠించిన వాతాపి గణపతి విద్యాప్రదాతయై యిప్పటికిని భక్తులచేఁ గీర్తింపఁబడుచున్నాఁడు. అగస్త్యుఁడు తపస్సుచేసిన యాశ్రమమున నిప్పటికిని గురుకుల మొకటి శోభతో నొప్పుచుఁ జాళుక్యవల్లభుల పూజాగౌరవములకుఁ బాత్రమై యలరారుచున్నది.

రాజాంతఃపురమున నిన్నాళ్ళును వాఘిరాకు నిమిషకాల మట్లు గడచిపోయినవి. స్వతంత్రముగా నదుపాజ్ఞలు లేక సంఘారామములోఁ బెరిగిన యా పిల్ల రాజమందిరమున నొక్కొడికిఁ దాళలేకపోయి యుండు నని భావించుట సహజము. అడవిలోఁ

బెరిగిన వనలత పెల్లగించి యుద్యానములో నాటెన, నది పెరుగక వాడిపోవు నని భావించుట సర్వసామాన్యము. అది యనుభవములేని కవుల కల్పనమే కాని వాస్తవము కాదు. అరణ్యములోఁ బెరుగు లత దెచ్చి లీలోద్యానములో వేసి, యనుభవముగల వనపాలకుఁడు పెంచినచో, నది వనమునఁ గంటె బలముగా మనోజ్ఞముగాఁ బెరుగుట యనుభవసిద్ధము గదా !

అట్లే వాఘిరాయు నంతఃపుర నియమములతోఁ బెరిగి మనోజ్ఞతరముగా వికసించినది. అదియుఁగాక సంఘారామములో స్వాతంత్ర్య ముండెననియు, నంతఃపురములో నియమము లెక్కువనియు, భావించుటకూడ సత్యేతరము. సంఘారామ నియమములు వేఱు, అంతఃపుర నియమములు వేఱు కావచ్చును. స్వేచ్ఛకూడ నంతే !

వాఘిరాకు సహజముగాసూక్ష్మగ్రహణశక్తియు, గ్రహించి నది దృఢముగా నిల్పుకొని మఱచిపోని ధారణ శక్తియుఁ గలవు. వానికిఁదోడు దాని దేహము నది స్వాధీనములో నుంచుకొనఁ గలదు. అంతఃపురములోని యాయాపండితుల శిక్షణ వలన, దానికి శీఘ్రముగా సంస్కృత ప్రాకృత భాషలలోఁ బాండిత్యమే కాక, రమ్యమైన గాథలు ప్రాకృతములోఁ జెప్పఁగల శక్తికూడ నబ్బినది. దాని గాథలు కొన్ని యాస్థాన విద్వత్కవుల మెప్పులు వడసి వారి జిహ్వాగ్రముల నృత్యమాడి

నవి. కవిత్వముతోఁ బాటు సంగీతము నృత్యము దాని కద్భుతముగా నలవడినవి.

భగవానుని ప్రసాదమని సంఘారామములోఁ గల వాఘిరా యశస్సు రాజప్రాసాదమునకును బ్రాఁకినది. అది నామమాత్రమునకే పట్టపురాణి పరివారములోనిదిగాని, దానికి రాణికి వలెనే సమాదరము జరుగుచున్నది. సత్యాశ్రయపులకేశివల్లభులకును మహారాజ్ఞికిని మాత్రమేకాక, యంతఃపురమునఁ గల సమస్త పరిచారికా బృందమునకు, నక్కడికి వచ్చిపోవు విద్వాంసులకుఁ గవులకుఁ గళావిదులకు మంత్రి దండనాథులకు, నది యాదర పాత్రమైనది.

వాఘిరాకు వయస్సు వచ్చినది. నల్లరాణి చేతిలోని నల్లగలువ వలెనే దాని యందచందము లొక్కసారిగా విచ్చుకొనినవి. దాని యవయవము లన్నియు వ్రటువ తేలినవి. చూచిన వారందఱు దాని యందమునకు ముగ్ధులై యుండిరి. ఆ యందములో నపూర్వత యున్నది. ఎట్టివారికిని దానిఁ గాంచినఁ బవిత్రమగు దేవతాభావ ముదయించును. తా మర్చించు దేవత సాక్షాత్కారము కావలె నని పరితపించు భక్తులు, వాఘిరా ప్రత్యక్షమైనచోఁ దమ యిష్టదేవత యీ రూపముతోడనే యుండునని భావించుకొని తృప్తినందుచుందురు.

మహారాజొకనాఁడు పట్టపురాణితో దీర్ఘాలోచనము చేయుచుండెను. అప్పటికి శ్రీహర్షవర్ధనుఁడు ఉత్తరదిగ్వి

జయముచేసి, వింధ్యపర్వతములను నర్మదానదమును దాఁటి దక్షిణదేశముపై దండెత్తివచ్చుటకు, సేనాపతియగు భండితో మంతనము లొనర్చుచుండె నని వార్తలు వచ్చి కొంతకాల మైనది. పులకేశివల్లభుఁ డప్పటికే మధ్యదేశ మంతయు జయించి, వింధ్య దాఁటి, యుత్తరదేశములపై దండెత్తుటకు సర్వప్రయత్నములు గావించియుండెను. తనరాజ్యమునకు దక్షిణమున పల్లవరాజగు మహేంద్రవర్మ వలన నీ సమయమున నెట్టిప్రమాదము రాకుండుటకుఁ దగు కాపువెట్టి, యుత్తరదేశ యాత్రాసన్నాహము లొనర్పవలసి యున్నది.

అట్లు పులకేశిమహారాజు తన పట్టమహిషితో మంతనములు సలుపుచుండ కార్యాంతరమున నక్కడికి వాఘిరా వచ్చి వారి యెదుట నిలిచినది. అప్పుడది శిరస్సుపై పుష్పపల్లవ కిరీటము ధరించినది. రత్నఖచిత మైన కడియములవంటి పెద్ద పోగులతో శ్రవణము లలంకరించినది. మెడలో వజ్రాల హారమున్నది. దాని క్రింద ముత్తెపుసరులు పేటగా వేసికొని వెనుక ముడివేసినది. దండచేతులను కేయూరములతో నలంకరించినది. ముంజేతికిఁ గంకణములు పెట్టినది. నల్లగలువ యొకటి నిడివియగు దాని కాండము కుడిచేతితో విలాసముగాఁ బట్టుకొని యున్నది. నడుమునుండి పైభాగ మించుక వెనుకకు వాల్చి, శిరోభాగము నోరగా ముందున కొంకింత వంచి, త్రిభంగి స్ఫురించు విధముగా నది నిలుచున్నది. మెఱపులీనెడి దాని చూపు లర్ధనిమీలితములై, చేతనున్న నల్లగలువపై

లగ్నమయ్యు, నేదో యందలి యాంతర పదార్థమును తిలకించు చున్నట్లున్నవి.

దానిని జూచినవెంటనే వారిరువురకు నొక్కసారిగాఁ దాము సంఘారామమునఁ దూర్పుచివర నలంకృతమగుచున్న గుహారామములోఁ జూచిన నల్లరాణి చిత్రాకృతి జ్ఞప్తికి వచ్చినది. సరిగా నిప్పుడిట్లు నిలిచిన యీ వాఘిరా బొమ్మనే, యచ్చు గ్రుద్దినట్లు చిత్రకారుఁ డక్కడఁ జిత్రించినట్లు వారికి స్ఫురించినది. మూడేళ్ళు ముందుగా దీని యిప్పటి రూపము చిత్రకారుఁడు భావించి యూహించియుండుట యెంత యద్భుతము! వాఘిరా నిజముగా నలౌకిక వ్యక్తియే, భగవానుని ప్రసాదమే యనిపించినది. వారి కప్పుడు విభ్రాంతి కలిగినది. ఆ విభ్రాంతితోఁ బాటు, వారికి నల్లరాణిని చిత్రించిన యీ కుమార చిత్రకారుని మోటురూపము జ్ఞప్తికివచ్చి, యాతనిఁ జూడవలె నను నుత్కంఠ కలిగినది.

రాణి : వాఘిరా, నీవు చిత్రకళ అభ్యసింతువా?

వాఘిరా : చిత్తము, తల్లి!

రాణి : ప్రభూ, వాఘిరాకు నల్లరాణి చిత్రము చిత్రించిన కుమార చిత్రకారునిచేత చిత్రకళ నేర్పించిన నెట్లుండును?

మహారాజు : నాకు సరిగా నదియే తోచినది. వెంటనే వాని నిక్కడికి కంప సంఘారామమునకు వార్త పంపెదను.

ఇట్లు వారు సంభాషించుచుండఁగనే, ప్రతీహారి వచ్చి, యజంతా సంఘారామమునుండి యెవరో దేవర దర్శనార్థమై

వేచియున్నాఁ డని నివేదించెను. మహారాజు చిఱు నవ్వుతో, "ఆ కుమారచిత్రకారుఁడే కాదుగదా! మహారాజ్ఞి సిద్ధసంకల్పత చూతము!" అనుచు వెంటనే యాతని ప్రవేశమున కనుజ్ఞ యొసఁగెను.

ఆ వచ్చినది నిజముగా నాకుమార చిత్రకారుఁడే !

అతఁ డంతఃపురము చూచి బెదరుచు, సరిగా నడుగులైనఁ బెట్టలేక తడఁబడుచు, మధ్యమధ్య నిలుచుచు ముందుకు సాగు చుండెను. తెఱచిన పెద్దనోరు తన వికృతాకారమును మఱింత వికృత మొనర్చుచుండ, నతఁడు తొట్రుపడుచు మహారాజులకు రాణికి వందన మాచరించి, కుమారశ్రీనాథు లిచ్చిన పరిచయ పత్రము నర్పించెను. అద్భుతాశ్చర్యమగ్నుఁడై మహారాజు కను సన్నచేయ, వాఫిరా యాపత్ర మందుకొని చదివి విని పించెను.

అది కొండపను జూచిన వెంటనే గుర్తించినది, కాని యది యంతఃపుర మర్యాదల కలవాటుపడి యుండుటచేఁ, దన హృదయములో నతనియెడఁ బొంగిపొరలి వచ్చుచున్న యాదరము నిగ్రహించుకొని, వానిఁ బలుకరింపనే లేదు. తన్ను వాఫిరా గుర్తింపనైన లేదని కొండప తలఁచి చిన్నవోవుచు, మఱింత కలవరపాటుతో నిలిచియుండెను.

రాణి : వాఫిరా, ఈ చిత్రకారుని యొద్దఁ జిత్రకళ నేర్చు కొందువా?

వాఫిరా : చిత్తము, తల్లి !

మహారాజు : నీ పేరేమి ?

"కొండప !"

మహారాజు కొంతవడి యాలోచనలో నిమగ్నుఁడై యిట్లనెను : "కొండపా ! ఈ యంతఃపురకుడ్యముల నలంకరించుట కింకేమి చేయవలసి యున్నది?"

కొండప : చూచి మనవి చేయుదును, మహాప్రభూ !

ఆ యంతఃపురము సర్వసంపన్నముగా చిత్రాలంకృతమై యున్నది. ఆ కారణమున నందిం కేమియు నలంకరింపవలసిన పని లేదని మహారాజుల భావము !

అట్లు మహారాజులకు మనవిచేసి వెంటనే కొండప యంతఃపుర చిత్రములఁ బరిశీలింప బయలుదేఱెను. చిత్రపరిశీలనలో కొండపకుఁ దడఁబాటంతయుఁ బోయినది. ఇతరము సమస్తము మఱచియుండి చిత్రములన్నియు నతఁడు చూచి చూచి మహారాజు నొద్దకుఁ దిరిగివచ్చి, "మహాప్రభూ, ఈ యంతఃపుర కుడ్యముపైనను బైకప్పుమీఁదను జిత్రించిన చిత్రము లద్భుతముగా నున్నవి. వానికి నేఁ జేర్పవలసిన దేమియుఁ గనుపింప లేదు" అనెను.

మహారాజు తుష్టినొందిన చిఱునవ్వుతో, 'మఱి నీకిక్కడఁ బని యేమున్నది కొండపా ?' యని యడిగెను.

కొండప నిశ్చలముగా నుత్తర మిచ్చెను. అతనికా ప్రదేశ మంతలోనే యలవాటు వడినది. అదికాక చిత్రప్రశంసా సందర్భములో నాతనికిఁ దొణుకు బెణుకులు లేవు.

"మహాప్రభూ, లేకేమి! చాల పని యున్నది. ఈ మండపములు శాలలు నాచ్ఛాదనములు లేకున్నవి. ఇక్కడ యవనికలపైఁ జిత్రములు వ్రాసి వ్రేలఁదీసి యీ యంతఃపురమును మఱింత మనోహరముగా వాసయోగ్యముగాఁ జేయవచ్చును."

సత్యాశ్రయపులకేశి వల్లభున కా మాటలు వినినంతనే కొండపపై ననుగ్రహము ద్విగుణీకృత మయ్యెను.

# 15

కొండప కిప్పుడు రెండుద్యోగములు సాగుచున్నవి. అవి రెండు నొకదానికంటె నొకటి యాతని కానందము గూర్చుచున్నవి.

అంతఃపురమును బెద్దయవనికలతోఁ జిత్రచిత్రముగా నాతఁ డిప్పు డలంకరింపసాగెను. అందులో నొక విశిష్టత నాతఁడు ప్రదర్శించెను.

ఇక్కడి చిత్రములు సంఘారామములోవలె బౌద్ధసంప్రదాయమునకు సంబంధించినవి కావు. పులకేశి వల్లభుల పితామహుఁడగు పులకేశి వల్లభుఁడు వైభవముగా నొనర్చిన యశ్వమేధయాగ చిత్రము లెన్నో మనోజ్ఞముగా గోడలపైఁ జిత్రింపఁబడి యున్నవి. ఆదివరాహము తన దంష్ట్రతో

భూదేవిని సముద్రజలముల నుండి యుద్ధరించుట, త్రివిక్రమావతారము నద్భుతముగాఁ జిత్రిత మైనవి. అన్నిటికంటె నెక్కువగా నచ్చట మహాభారత కథా ఘట్టములు ప్రదర్శించు చిత్రము లున్నవి. చాళుక్యులు తాము చంద్రవంశక్షత్రియుల మని చెప్పికొనుచుండుటచే, మహాభారత చిత్రములే కాక చంద్రవంశపు రాజుల చిత్రము లెన్నియో యక్కడ వారు చిత్రింపఁజేసి యుండిరి. కచదేవయానుల సంతాపకథ, శర్మిష్ఠాయయాతుల ప్రేమకథ, నహుషుని శాపకథ, ఇట్లెన్నెన్నియో కథ లున్నవి. ఇఁక నక్కడఁ జిత్రించియున్న మహాభారత కథా దృశ్యముల కంతులేదు. మహాభారతావతరణము నుండి స్వర్గారోహణము వఱకు శతసహస్ర సంఖ్యాకముగాఁ జిత్రము లున్నవి. యవనికలపైఁ జిత్రించుట కిఁక మహాభారతకథలు మిగులలేదు. జాతకకథల కక్కడఁ బొత్తుకుదుర దని కొండప ముందే గ్రహించెను. తానిక్కడ నేమి చిత్రములు వ్రాయవలె?

కొండప యొకనాఁటి రాత్రి యేకాగ్రముగాఁ జింతించుచుఁ బ్రొద్దుపోవువఱకు మేల్కాంచి యుండెను. ఆవల నాళికులు గడచిన గడియలు ప్రకటించుచుండిరి. గడియారమున గంటలు మ్రోయుచుండెను. పరధ్యానముగా గంటలు లెక్కపెట్టుచుండఁ గర్తవ్యము స్ఫురించినది. రామాయణ చిత్రములు రఘువంశచిత్రములు చిత్రించినచో, నామహాభారతచిత్రములు చంద్రవంశచిత్రములతో నేకశ్రుతిగాఁ గలసిపోవునని యాతనికి స్ఫురించినది. కాళిదాస మహాకవి కథ ప్రధానముగా నతఁ

డనుసరింప నిశ్చయించెను. రఘువంశ చిత్రములను దిలీప మహారాజు గోసేవా దీక్షతో నాతఁ డారంభించి, తుదకు స్త్రీలోలుఁడై రాజయక్ష్మ వ్యాధితో దేహము చాలించినయగ్నివర్ణుని చిత్రములతో పరిసమాప్తి గావించెను.

రఘువంశ చిత్రము లారంభించిన దాదిగా, మహారాజులచేఁ నాహూతులై పలువు రాస్థాన విద్వాంసులు కవులు నా చిత్రములు చూచి నూతన చిత్రకారుని యద్భుతప్రజ్ఞను గొనియాడసాగిరి. అట్టిపెద్దల సాహచర్యముచేఁ గొండపకును క్రొంగ్రొత్త యూహలు స్ఫురింపసాగెను. ఆ యా ఘట్టములలో నతనికిఁ గలుగుచున్న సందేహములు వారి నడిగి తెలిసికొనుచుండెను. రఘువంశ చిత్రములు పూర్తి కావించి, కుమార సంభవములోని పార్వతీపరమేశ్వరుల చిత్రములు హిమాలయ దృశ్యములతో ప్రసన్న గంభీరముగాఁ జిత్రించి, యంతట మేఘదూతములోని ఘట్టము లారంభించెను.

యక్షుని విరహము మేఘుని గమనము యక్షిణి నిరీక్షణము నాతఁడు చిత్రవిచిత్రమార్గములఁ బ్రదర్శించెను. అందులో యక్షుని యాకార మన్ని రూపులఁ గొండప రూపమే; యక్షిణి యాకార మన్నిరూపుల వాఘిరా రూపమే. ఇఁక మేఘుని చిత్ర చిత్రగమనము లపూర్వముగా నున్నవి.

ఇట్లొకవంక నంతఃపురము నలంకరించుటకు మహాయవనికలు చిత్రించుచుఁ గొండప మఱియొకవంక వాఘిరాకుఁ జిత్రరచన నేర్పుచుండెను.

వాఘిరా చిన్నతనమునుండియు సంఘారామములో నెన్నియో రమణీయ చిత్రములు చూచి యుండెను. అంతఃపురమున మఱియెన్నియో చిత్రములు దర్శించి యున్నది. అందుచే దానికిఁ బుష్కలముగాఁ జిత్రపరిజ్ఞాన మున్నది. అందులకుఁ దోడుగా సర్వతోముఖముగాఁ బ్రసరింపఁగల ప్రజ్ఞ దానికి సహజముగా నున్నది. కావున దానికి శీఘ్రకాలముననే చిత్రకళలోఁ బ్రవేశమే కాక పాండిత్యముకూడ నబ్బినది. అదియుఁ గాక కొండప వచ్చినప్పటినుండి దాని కుత్సాహ మెక్కువైనది. వారు తఱచుగా సంఘారామములోఁ దామాడిన యాటలు స్మరించుచు కుమారశ్రీనాథుల నిరతిశయ వాత్సల్యము భక్తిగౌరవములతోఁ బ్రశంసించుచుందురు.

అంత మాత్రమున, వాఘిరా వెనుకటివలెఁ గొండపతో నడవిపిల్లవలె ననర్గళముగా సంచరించుచున్న దని తలఁప రాదు. ఇప్పుడు వాఘిరా పట్టపురాణి చెలికత్తె. కొండపయో, మహారాజుల భృత్యుఁడు. రాణి భృత్యులఁ జూచునట్లే వాఘిరా యిప్పుడు కొండపను జూచుచున్నది. మొదట మొదట నది కొండపకుఁ గ్రొత్తగా నుండెను; పిమ్మటఁ గష్టముగాఁ దోచెను. ఐనను వాఘిరా సన్నిధానమున నుండుట, దానిఁ జూచుట, దానితో మాట్లాడుటయే, యాతఁడు మహాభాగ్యముగాఁ బరిగణించుచుండుటచే దాని ప్రవర్తనమున కలవాటు పడెను. మహారాజ్ఞి మందిరములోఁ దానొక భృత్యుఁడనని గుర్తెఱిఁగి ప్రవర్తింపసాగెను. అందువలన నతనికిఁ గలుగు

చున్న బాధ వాఫిరా గమనించినట్లే లేదు. కొండప యేకాంత ముగా నుండి, వాఫిరా చర్యలు తలంచుకొని విశేషముగా వ్యథనొందు నప్పుడు తన చిన్న చెల్లెలి మాటలును మాతృ వాక్యములును స్మరించి, 'ఇది నిజముగా వ్యాఘ్రియే. దీనికి జాలి యెక్కడిది?' యని నిందించును.

# 16

మేఘదూత చిత్రము లారంభించినప్పటినుండి కొండపకొక క్రొత్త బాధ యారంభించినది. ప్రతి దినమున మధ్యాహ్న వేళను, సాయంసమయమునను, అగస్త్యాశ్రమములోని గురు కుల బ్రహ్మచారి యొకఁడు పట్టమహిషి యంతఃపురమునకు వచ్చి, రాణి యిష్టదైవమగు పరమేశ్వరుని పూజ నిర్వర్తించి పరమేశ్వర తీర్థప్రసాదములు రాణికిని బరిజనమునకు నిచ్చి పోవుచుండును. ఆతఁడట్లు వచ్చి పూజ కావించు చున్నంత సేపును వాఫిరా యచ్చటనే యుండి, పూజావసానమునఁ దీర్థ ప్రసాదములు గ్రహింపఁ దనవంతు వచ్చువఱకు శ్రద్ధాభక్తు లతో వేచియుండి, శ్రీపరమేశ్వర పాదతీర్థము శిరస్సునఁ జల్లుకొని పుచ్చుకొని ప్రసాదభక్షణ మొనర్చును.

అంతే కాదు. పూజాప్రారంభమునకు వ్యవధాన మున్న సమయములలో, నా బ్రహ్మచారి కొండప చిత్రములు వ్రాయు

చిత్రశాలకు వచ్చి పటములు తిలకించుచుండును. పటములు చూచునప్పు డాతని మనస్సు చిత్రకారుని నేర్పుపైఁగాక చిత్రించిన విషయమున లగ్నమై యానందముతో వికసించును. గురుకులమున నాతఁడు శుశ్రూష చేయుచు తనశాఖ వేదము సాంగముగా నధ్యయన మొనర్చి పూర్వమీమాంసా గ్రంథము పఠించుచున్నాఁడు.

అతని దేహము బంగరు చాయ గలది. నాసిక తిలపుష్పము వలెఁ దీర్చిదిద్దిన ట్లుండును. చెవులు శ్రీకారములవలెఁ, జెక్కిళ్ళద్దములవలె మెఱయు చుండును. కన్నులు పద్మపత్రములవలె విశాల మైనవి. ఫాలతల మష్టమీచంద్రరేఖ ననుకరించును. సంస్కరింపని యాతని శిరోజములు జడలు తేలి ముడివడి యుండి, బ్రహ్మతేజస్సుతో మిసమిసలాడు నాతని దేహకాంతిపైఁ గిరీటమువలె భాసించును. ఆతని బుజమున యజ్ఞోపవీతము, నడుమునఁ జుట్టిన ముంజగడ్డితో మెలివెట్టిన మేఖల, చేత నుండు పలాశ దండము, నాతని కొకవింతయందము చేకూర్చుచుండెను. ఆతని యాకారము మనస్సున నుంచుకొనియే కొండప రామాయణమున ఋశ్యశృంగుని చిత్రము లిఖించెను. ఆబ్రహ్మచారి యచ్చముగా ఋశ్యశృంగుని దలపించుచుండెను.

ఆతఁ డంతకంత కిపుడు పూజాకాలమున కెక్కువ ముందుగా వచ్చి, యెక్కువకాలము చిత్రశాలలోఁ జిత్రములు చూచుచుఁ దత్తత్కథాభాగములందు మనస్సు లీనమొనర్చుచున్నాఁడు. ఆ చిత్రము లాతని నాకర్షించినవి.

ఆ బ్రహ్మచారి కనఁబడి నంతనే వాఘిరా ముఖ మానంద ముతో వికసించును. అది యాతని యెడ భక్తిశ్రద్ధలు ప్రదర్శించుచుఁ జిత్రశాల కతని ననుగమించి, యచ్చటి నూతన చిత్రములు చూపుచు, విశేషములు వివరించుచుండును. పూజకు సిద్ధమైన దని సూచించు ఘంటారావము విని యాతఁడు బయలుదేఱ, వాఘిరా వానితోఁ బూజామందిరము నకుఁ బోవును. ఆతఁడు పూజ పూర్తిచేసి వెళ్ళిన తరువాత గాని వాఘిరా కొండపకుఁ గనిపింపదు. బ్రహ్మచారి కను చాటైన తరువాత వాఘిరా కుత్సాహము తగ్గిపోవును. దిన ములు గడచిన కొలఁదియు నిప్పుడు బ్రహ్మచారి వెళ్ళిపోయి నంతనే, వాఘిరా కుప్పకూలిన ట్లవుచున్న దని కొండప గమ నించినాఁడు.

మొదట మొదట వాఘిరా మోహమును గొండప పరి హాసము చేయుచుండువాఁడు. అతఁడు ఋశ్యశృంగునివంటివాఁ డని యది చిఱునవ్వు నవ్వుచుండెడిది. అట్లు కొన్ని దినములు గడవఁగా కొండప పరిహాస మెక్కువ యగుచున్నది. వాఘిరా కాతని పరిహాసము చిరాకు పుట్టింప సాగినది. మరి కొంత కాలమునకు బ్రహ్మచారి వెడలిపోయినవేళఁ గొండప కనఁ బడినచో దాని కన్నులలోఁ గ్రూరమగు వ్యాఘ్రి చూపు వ్యక్తము కాఁజొచ్చెను. వికారాకారము గల తాను కనఁబడి నంతనే వాఘిరా కసహ్యము కలుగుచున్న దని కొండపకు తట్టినది. అది చిత్రరచన నేర్చికొనుటకుఁ గాని జిత్రరచనలోఁ

దనకు సాహాయ్య మొనర్చుటకుఁ గాని చిత్రశాలకు వచ్చుటే యరుదైనది. బ్రహ్మచారి యచ్చటికి వచ్చినప్పుడు మాత్ర మది తప్పక వచ్చుటయుఁ గొండప గుర్తించినాఁడు. కొండప కంతరంగములో నిది మహాసంక్షోభము కలిగించుచున్నది.

చిత్రకారుఁడు తన హృదయావేదన నెట్లు వ్యక్తముచేయఁ గలఁడో, సరిగా కొండప యట్లే యది వెళ్ళఁగక్కు కొనెను.

ఇప్పు డాతఁడు మేఘదూతములోని ఘట్టములు చిత్రించు చుండెనుగదా! ఆ చిత్రములు బ్రహ్మచారి చూచుచు వెను కటి వలెఁ దన్మయత్వ మందక జాలితోఁ గూడిన విషాదరేఖ ముఖమున వెలార్చుచున్నాఁడు. అది గమనించిన కొలఁది కొండప కాతనిపై రోషము ద్వేషము నతిశయింప సాగినవి.

"నా వాఘిరాను తన ప్రేమ వాగురలోఁ బట్టుకొని యీడ్చికొని పోవుచున్న యీ బ్రహ్మచారిబ్రువునకు ప్రేమ చిత్రములన్న నింత యీసడింపా? ఏమి నటన? ఎంత దొంగ?"- ఈ విధముగా బ్రహ్మచారిని కొండప మనస్సులో దూషించు చుండెను.

ఒకనాటి మధ్యాహ్న సమయమున పూజకు వ్యవధాన మున్నందున బ్రహ్మచారి చిత్రశాలకు వచ్చెను. ఆతని వెంటనే వాఘిరాయును వచ్చినది. బ్రహ్మచారి రఘువంశచిత్రములలోఁ జివరనున్న అగ్నివర్ణుని చిత్రములు ముందు పరికించెను. అగ్ని వర్ణుఁడు తనరాజ్యభార మంతయు మంత్రులపైఁ బెట్టి, విషయ లోలుఁడై, లీలోద్యానాదులలో సంగీత నాట్య కళాది గోష్ఠు

లలో విహరించుచుండుట నానావిధములఁ జిత్రితమైయున్నది. రాజదర్శనము కావలెనని కాంక్షించిన ప్రజానీకమున కాతఁడు సౌధముపై గవాక్షమునుండి తన పాదాంగుష్ఠము ప్రసరించుచుండెను. ఆ చిత్రము లన్నియు నుజ్జ్వలమైన వర్ణము లతో మహావైభవముగాఁ జిత్రింపఁ బడినవి. తుద కాయగ్ని వర్ణుఁడే చిక్కి శల్యమై పాలిపోయి క్షయవ్యాధితో బాధ పడుచు, నతనివలెనే యెండి ప్రోడైన సహకారతరువు క్రింద నవసానదశలో నున్నట్లు చిత్రింపఁ బడెను. బ్రహ్మచారి యా చిత్రములు చూచి నిర్వేదమంది,యచ్చటినుండి సరాసరి మేఘ దూత చిత్రము లున్నయెడకు వచ్చి యతిశయించిన జాలితో వానిని దిలకింపసాగెను. ఇంతసేపును వాఘిరా యా బ్రహ్మ చారి వెంట ఛాయవలె నంటియే యుండెను.

ఆవల పట్టమహిషి పూజామందిరమునుండి పూజావేళ యైన దని సూచించు ఘంటారావము వినవచ్చినది. బహ్మచారి పూజకై బయలుదేరుచుండ, వాఘిరా యాతనికంటె ముందుగా దారితీయుచు బయలుదేరినది. ఇంతవరకు కొండప తన చూపులతో వాఘిరా ననుసరించుచు, నది తనవంకనైనఁ జూడక యా బ్రహ్మచారి ననుగమించుచుండుట చూచుచున్న కొలఁది, ఆతనికి మాత్సర్యముతోఁ గూడిన క్రోధ మతిశయింప సాగినది. తుదకు వాఘిరా బ్రహ్మచారితో వెళ్ళిపోవుచుండ నాతఁ డది భరింపలేక, 'వాఘిరా, ఇట్లొకమాఱు రా!' యని పిలిచెను. 'త్వరగా పూజకుఁ బోవలె' ననుచు వాఘిరా

యాతని పిలుపు లక్ష్యము చేయక వెనుదిరిగి నైనఁ జూడక బ్రహ్మచారితో వెడలిపోయినది. తన వాఘీరాను ఆ బ్రహ్మచారి తనకుఁ గాకుండ నెత్తుకొని పోవుచున్నాఁ డని కొండపకుఁ దోఁచినది.

వాఘీరా వెళ్ళిపోవుట చూచిన కొండపకు దేహమంతయు తిరుగుడు వడినది. కడుపులోనుండి యేదో తెమల్చుకొని వచ్చుచున్న ట్లయి కలచుచున్నది. కన్నులు పొడిచికొని వచ్చుచున్న ట్లయినవి. అతఁడు చెప్పలేని యారాటముతో కుమిలిపోయెను.

ఆ మధ్యాహ్న వేళఁ గొంతతడవట్లు క్షోభ పడి పడి, కొండప చివాలున లేచి కుంచెయు రంగులు నందుకొనెను. యక్షునికై విరహవేదన పడుచుఁ బ్రేమతో నిరీక్షించుచున్న మేఘదూతములోని యక్షిణిచిత్రములో, ఆ యక్షిణి నెత్తుకొని పోవుటకై వెనుకగాఁ బొంచి యున్న బ్రహ్మరాక్షసరూప మొకటి వెంటనే కొండప చిత్రింప నారంభించెను. కొండప హృదయములోని యావేగము కొలది, ఆ చిత్రమును శీఘ్రగతి గూపొంద సాగినది.

సరిగా నందులో గురుకుల బ్రహ్మచారి యాకారమే యతఁడు చిత్రింపసాగెను. ఆ బ్రహ్మచారి ముఖములోని సౌమ్యతగాని ముగ్ధతగాని పూర్ణతగాని యాచిత్రములో నేమాత్రము లేవు. ఆ బ్రహ్మచారి ముఖము రేఖ లించుక మలఁచుటచే వికృతాకారము నొందినది. ఆతని జడలు

వానపాముల రూపొందినవి. ఆతని యజ్ఞోపవీతము మేఖల బుసలు కొట్టుచున్న నాగుఁబాములవలె నున్నవి. కొన వంకర తిరిగిన యాతని కోలముక్కు చివర మఱింత సూక్ష్మమై క్షుద్రపక్షులఁ జీల్చి చెండాడు డేగముక్కు ననుకరించుచున్నది. సంస్కారము చేయక పెరిగియుండు బ్రహ్మచారి చేతులఁ గాళ్ళ గోళ్ళు, డేగ గోళ్ళవలెఁ గొనలు తేలి వాఁడిగా నుండు నట్లు చిత్రించినాఁడు. ఆతఁడు చేత ధరించు బ్రహ్మదండము కాలదండమువలె భయంకరముగా మాఱినది. దేహచ్ఛాయ పొగవాఱినట్లు చేయుటతో బ్రహ్మచారి రూపమున బ్రహ్మ రక్షస్సు నాకార మావహించినది.

## 17

సాయంకాల పూజకు బ్రహ్మచారి వచ్చు వేళ యగు చున్నది. కడుపులోఁ గుములుచున్న కోపముతోడను, గసి తీర్చుకొంటి నను చిత్రమైన తృప్తితోడను, బ్రహ్మచారి రాకకై కొండప యానాఁడు నిరీక్షింపసాగెను. బ్రహ్మచారి కాచిత్రము చూపి యాతని నొప్పింపవలె నని యాతని యాలో చనము. ఎన్నఁడు లేని దీనాఁడు బ్రహ్మచారి రావలె నని యాతని కుత్కంఠ కలుగుచున్నది. బ్రహ్మచారి యెంతటికిని

రాకుండుటచే నతనికిఁ జిరాకుగా నున్నది. ఆ సాయంకాల పూజకే బ్రహ్మచారి రాలేదు.

తీఱని కోపముతో నారాత్రి యంతయుఁ గొండప తన కసి తీర్చుకొను నుపాయము లాలోచించుచుఁ గడపెను. కసియెవరి మీద? ఆ బ్రహ్మచారి మీద. అది తీర్చుకొను టెట్లు? ఆ బ్రహ్మచారి వచ్చిపోవు దారిలో రహస్యముగాఁ గాచి యుండి యాతనిఁ బట్టుకొని కొట్టవలె నను నాలోచన మాతనికిఁ దట్టనే లేదు. ఆతని కోపమంతయు నా బ్రహ్మరక్షస్సు బొమ్మమీదనే లగ్నమైనది. నిజరూపముతో నెదుట సంచరించుచున్న బ్రహ్మచారి రూపముకంటెఁ దాను చిత్రించిన బ్రహ్మరక్షోరూపమే యాతని నిజరూపముగా నాకుమార చిత్రకారునకు భాసింపసాగినది. కావునఁ దన కసి యంతయు నా బొమ్మమీదనే తీర్చుకొనవలెనని యాతని యాలోచన. ఆ రూపము మఱింత క్రూర భయంకరముగా వికృతముగాఁ బ్రదర్శించు టెట్లు? ద్వేష మాతని యూహలకుఁ బదను గలిగించినది. ఆ రాత్రి యంతయు నట్లాలోచనల తోడనే వెళ్ళఁ బుచ్చెను.

మఱునాఁ డుదయముననే చిత్రశాల కేగి యతఁడు బ్రహ్మరక్షో రూపమునఁ దన తూలికతోఁ గొన్ని మార్పులు గావించినాఁడు. ఒడలిపైనుండు సూక్ష్మరోమములు తేలుకొండుల వలె రూపొందించి, యందులోఁ గొన్ని గుత్తులు గుత్తులుగాఁ జిత్రించినాఁడు. బహ్మచారి బొమ్మపైఁ బెద్ద కణితి యొకటి

యసహ్యాముగాఁ జిత్రించినాఁడు. దానితోఁ గొండప తన హృదయ భార మంతయు బ్రహ్మచారి హృదయముపైఁ బెట్టి నట్లు భావించి తృప్తి పడినాఁడు.

గత సాయంకాలముకంటె నెక్కువ యుత్కంఠతో బ్రహ్మ చారి రాకకై కుమార చిత్రకారుఁ డీయుదయము నిరీక్షించి నాఁడు. ఆతనికి మరల నాశాభంగమైనది. బ్రహ్మచారి పూజకు రాలేదు.

అట్లు కొండప వారము దినములపాటు బ్రహ్మరక్షస్సు బొమ్మ నంతకంత కెక్కువ వికృతభయంకరము గావించుచు, బ్రహ్మచారి రాకకై యెక్కు వగుచున్న యావేగముతో నిరీ క్షించు చుండెను. పాప మాతని కాసంతుష్టి చేకూరనే లేదు. ఆ వారము దినములు బ్రహ్మచారి పూజకే రాలేదు. అన్ని నాళ్ళను వాఘిరాకూడఁ జిత్రశాలకు రాలేదు.

విస్మయ పరవశుఁడై కొండప కారణ మేమని విచారింపఁగా, బ్రహ్మచారి గురుకులమున జ్వరముతో బాధపడుచుండె నని తెలియ వచ్చినది.

ఆ బ్రహ్మచారికి దేహమంతయుఁ దాపముతో మండుచున్న ట్లుండెను. శిరస్సునం దంతట నిరంతర మేమో ప్రాఁకులాడు చున్నట్లు గులగుల లాడుచుండెను. ఆతని యజ్ఞోపవీత మున్నంత మేరను నాగసర్పము ప్రాఁకుచున్నట్లు భాసించు చున్నది. నడుమునఁ గట్టిన మేఖల జెఱ్ఱిపోతు చుట్టినట్లు బిగఁ దీయుచున్నది. రోమకూపములం దెల్లెడఁ దేళ్ళు కుట్టుచున్నట్లు

బాధగా నున్నది. ప్రక్కనుండు దండము కాలదండమువలె దన్ను లాగుటకు మెలికలు తిరుగుచు మీదికి వచ్చుచున్నట్లు భయ మావేశింపఁ జేయుచున్నది. అన్నిబాధలకంటె గుండెలో బాధ యెక్కువ. తన గుండెపై నేదో పెద్దకొండ పెట్టినట్లు బరువుగా నున్నదని యాతఁడు నిరంతర మారాట పడు చుండెను.

తోడి బ్రహ్మచారు లుపచారము లొనర్చుచుండ గురుకు వైద్యుఁ డాతనికిఁ జికిత్స చేయుచుండెను. వ్యాధి తన కెంత కిని లొంగకుండుటచే నిది పరప్రయోగమని వైద్యుఁడు నిర్ధా రణ మొనర్చెను. ఇన్ని దినములును గులపతి యజ్ఞదీక్షలో నున్నందున నా బ్రహ్మచారికి దురదృష్టవశమున గురు దర్శ నము కాలేదు.

వారము దినముల పిమ్మటఁ దన యజ్ఞదీక్ష పరిసమాప్తి కావించుకొని, కులపతి యవభృథ స్నాన మొనర్చి విద్యా యస్వస్థుఁడై యున్నాఁడని తెలిసిన వెంటనే యాతనిఁ జూ వచ్చెను. చూడఁగాఁ గులపతికి బ్రహ్మచారి రూపము గా యాతని నావరించిన బ్రహ్మరక్షోరూపమే భాసించినది. కు పతి తత్తరపాటుతో, "ఆయుష్మన్, నిన్నుఁ దీవ్రముగ ద్వేషించు వారెవరున్నారు, నాయనా?" యని ప్రశ్నించెను

శ్రీ గురుదర్శన మైన క్షణమున నుండి బ్రహ్మచారికిఁ దా మించుక యుపశమించి నట్లున్నది. ఒడలిపైఁ దేళ్ళు పాము ప్రాఁకు లాడుట మందగించినది. హృదయభార మించు

శాంతించినది. ఆతఁడు లేచి గురువులకుఁ బాదాభివందన మాచరించుచు, "గురుదేవా, నన్ను ద్వేషించు వా రెవరు నున్నట్లు నా కెఱుక లేదు" అనెను.

కులపతి యాతనిఁ బరుండ నాజ్ఞాపించి, తన యమృత హస్తము నాతని శిరస్సున నుంచి, యాతనిఁ దన కరుణామృత దృష్టితో నాప్లావితు నొనర్చుచు, నర్ధఘటికా మాత్రము ధ్యానమగ్నుఁడై యుండెను. అప్పటికి బ్రహ్మచారి నావరించిన రక్షోరూప మాతని వదలి, తన యెదుట దీనముగా నిలిచి యున్నట్లు భాసింపఁగా కులపతి, "నీవు వచ్చిన చోటికిఁ బొమ్ము. నిన్ను సృష్టించిన వానిని బాధింపకు సుమా! నీకుఁ బదేళ్ళకు విముక్తి రాఁగల!" దని దానిని శాసించి పంపివేసెను.

కులపతి యంతఁ దన హస్తము బ్రహ్మచారి శిరస్సు పైనుండి తీసి, "నాయనా, నీకిఁక స్వస్థత కలుగునులే. నీవీ నాఁడు వలసినంత గోక్షీరములు సేవింపుము. మా యనుజ్ఞ లేనిది మరల రాజమందిరమునకుఁ బోవకు సుమా!" యని విధించి తన పర్ణశాల కేగెను. తర్వాతఁ గొలఁది సేపటికే బ్రహ్మచారి యాఁకలి దహించుకొని పోవుచున్న దని గోల చేయఁగా తోడి బ్రహ్మచారులు గుర్వాజ్ఞావిధి ననుసరించి యాతనికి గోక్షీర మిచ్చిరి. అతఁ డారాత్రిలోపల నంత గోక్షీరములు త్రావుట చూచినవారి నెల్లర విభ్రాంతుల నొనర్చెను.

మూఁడు దినములలో నా బ్రహ్మచారి స్వస్థుఁడై గురుకుల మున నడయాడఁ గలిగెను. వారము దినములకు యథాప్రకార మాతఁడు మీమాంసాధ్యయనము సాగించెను.

# 18

ఆ బ్రహ్మరక్షస్సు బొమ్మ వ్రాసినది వాఘీరా యెఱుఁగదు. వెనుకటి బ్రహ్మచారి జబ్బుగా నుండి దేవతార్చనకు వచ్చుట లేదని పూజ కిప్పుడు వచ్చుచున్న యింకొక బ్రహ్మచారివలనఁ దెలిసికొన్నది. పూఁట పూఁట ఆతని జ్వర మెట్లున్నదో యని వ్యగ్రతతోఁ దెలిసికొనుచున్నది. ఆతఁడు పడుచున్న బాధ విని తాను బాధపడ సాగినది. అతనికి నయమైన దని తెలిసి నంతవఱకు వాఘీరాకు సరిగా నిద్రాహారములు లేవు. నయ మైన పిమ్మట నాతని రాకకై యది యుత్కంఠతో నిరీక్షింప సాగినది. తుద కాతఁ డిఁకఁ బూజకు రాజమందిరమునకు రాఁడని తెలియఁగనే, వాఘీరా హృదయములో నొక్క పెట్టున మహాభారము ప్రవేశించినది.

ఈనాఁడు మహారాజ్ఞి చిత్రశాల దర్శింప నుద్దేశించిన దను వార్త ముందుగాఁ జెప్పుటకు, వాఘీరా చిత్రశాల కరు దెంచినది. "ఈ మధ్య నేను రాకున్నప్పు డేమేమి క్రొత్త

చిత్తరువులు వ్రాసితివి?" అని కొండపను దయతోఁ బ్రశ్నించి నది. కొండప కోపముతో మూతి బిగించుకొని బదులు పలుకలేదు. అప్రయత్నముగా నాతనిచూపుమాత్రము యక్షిణి నెత్తుకొనిపోవ నున్న బ్రహ్మరక్షస్సు చిత్రము వంకకుఁ బ్రసరిం చుటచే, నాతని చూపు ననుసరించి వాఘిరా యాచిత్రము కాంచినది. వెంటనే యాభయంకరాకారము చాటునఁ దాను భక్తితో భావించుచున్న యా బ్రహ్మచారి యాకారము నుప లక్షించి నివ్వెఱపోయినది.

"కొండా, నన్నా బ్రహ్మచారి యెత్తికొని పోఁదలఁచె నని భయపడితివా ?"

కొండప మాటాడక మొగము ముడిచికొనెను.

"కొండా, ఈ మేఘదూత చిత్రములలో యక్షిణిరూపము చిత్రించుటకు నిలుచుండి నీకుఁ దోడుపడినంత మాత్రముచేతనే నేను నీకు భార్యనైతి ననుకొంటివా?- బుద్ధభగవానుని ప్రసాద మీలోకములో నెవ్వరిని వివాహమాడఁ బొల్పడ దని గ్రహింప నేరకపోతివా? నేను నీపైఁ జూపిన జాలి నీ కింత మైమఱపు కలిగించినదా!"

అప్పటికిని గొండప మాటాడలేదు. అతనిముఖమునఁ గోప ముతోఁ జీకటులు క్రమ్ముచున్నవి. వాఘిరాకు స్పష్టముగాఁ దెలియకున్నను, బ్రహ్మరక్షస్సు నాకృతికిని తాను వినియున్న బ్రహ్మచారి పడిన బాధకును గొంత సామ్య మున్నట్లు స్ఫురిం

చినది. వాఘీరా మనస్సులోఁ గొండపపై నాగ్రహ ముద యించినది.

"కొండా, నీవింత క్రూరస్వభావము కలవాఁడ వని నే నెన్నఁడు ననుకొనలేదు. ఎఱిఁగి యున్నచో నీతో నే నెన్నడు నేస్తము చేసి యుండను."

ఈ మాటలకుఁగూడఁ గొండప మౌనము వదలలేదు. వాఘీరా చివ్వునఁ దలయెత్తినది. దాని కన్నులు కోపముతోఁ బ్రజ్వలించినవి.

"చిత్రకార మహాశయా, ఈనాఁడు తాము చిత్రశాల దర్శింప వత్తుమని, మీతోఁ జెప్పిరమ్మని శ్రీమహారాజ్ఞివారు సెలవిచ్చినారు – ఆ బ్రహ్మరక్షస్సు చిత్రము వారు చూచుట కిచ్చగింపరు!"–ఇట్లు పలుకుచునే వాఘీరా గిఱ్ఱున వెనుదిరిగి యంతఃపురమున కేగెను.

ఆ నాటి మధ్యాహ్నమే మహారాజ్ఞి చిత్రశాల దర్శింప వచ్చినది. ఆమె పరివారముతో వాఘీరాయును వచ్చినది. వాఘీరాయే మహారాజ్ఞి కక్కడి చిత్రములు చూపుచు వివరించుచున్నది. బ్రహరక్షస్సు బొమ్మ కొండప తీసివేయలేదని గమనించి, వాఘీరా యాతని వంకకుఁ దిరిగి చుఱచుఱ చూచినది. కొండప మూతి ముడిచికొని తల వంచుకొనెను.

రాణికి రఘువంశచిత్రములు కుమారసంభవ చిత్రములు వాఘీరా చూపినది. కుమారస్వామి కార్తికేయ కృత్తికలు పాలిచ్చుచున్న చిత్రము రాణి వేడుకతోఁ దిలకించుచు నట్టె

కుమారుఁడు తన కెప్పుడు ప్రాప్తించునా యను లోలభావము వ్యక్తీకరించినది.

మేఘదూత చిత్రములు చూపకుండ దాటివేయ యత్నించినది వాఘిరా. అందులో యక్ష యక్షిణీ చిత్రములు మేఘ చిత్రములు రాణి నాకర్షించినవి. అందులో వాఘిరా యాకారము కొండప రూపము గుర్తించి, రాణి వా రిరువురవంకఁ బ్రసన్న భావముతోఁ జూచినది. అది యేమియు వాఘిరా మనస్సునఁ బట్టించుకొనలేదు. ఆ బ్రహ్మరక్షస్సు చిత్ర మెక్లైన రాణి కంటఁ బడకుండఁ జేయవలె నని వాఘిరా బహువిధముల యత్నించినది. అంతసేపు నది యా చిత్రమున కడ్డుగా నిలుచుండి రాణితో సంభాషించుచున్నది. "తల్లీ! ఇవి కేవల కాముకుల చిత్రములు. గాలికిఁ జెల్లాచెదరయిపోవు మేఘ చిత్రములు. విశేషము లేదు. అదిగో, అక్కడ శ్రీ సత్యాశ్రయపుల కేశివల్లభుల యుదాత్త చిత్ర మున్నది. దర్శింతము రండు!" అనుచు రాణి నటనుండి బయలు దేఱఁ దీసినది. రాణి కదలినంతనే వాఘిరా తీఱిన హృదయ భారముతో నాచిత్రమున కడ్డు తొలఁగి రాణి ననుగమించుచున్నది.

అంతఃపురములో వినోదము కొఱకుఁ గుబ్జలను బరిచారికలఁగాఁ బెట్టుకొనుట యాచారము. వారి యాకారమున కనుగుణముగనే వారికి వక్రవిషయములు సులభముగా గోచరించును. అట్టి కుబ్జ యిప్పుడు రాణి పరివారముతో వచ్చినది. దానికి సరిగా నిప్పుడు బ్రహ్మరక్షస్సు బొమ్మ కనఁబడి

నది. "అయ్యో, దొరసానీ, ఈ చిత్ర మెంత భయంకరముగా నున్నదో చిత్తగించితిరా?" అని కుబ్జ వెళ్ళుచున్న రాణిని కేక వేసి పిలిచినది.

మహారాజ్ఞి వెనుదిరిగి యాచిత్రము చూచినది. కొండపను జూచినది. వాఘిరా వంకఁజూడ నది తల వంచికొన్నది. రాణి మరల మేఘదూత చిత్రము లన్నియు సింహావలోకన మొనర్చినది.

మహాసామ్రాజ్య మేలెడి సత్యాశ్రయపుల కేశివల్లభుల పట్టమహిషియై, రాజ్యభారము వహింపఁ దోడ్పడుచున్న రాణి కంతమాత్రము తెలియదా? ఆ బ్రహ్మరక్షశ్చిత్రములోఁ దనమందిరమునఁ బూజార్థము వచ్చుచుండిన బ్రహ్మచారి రూపము గుర్తించినది. బ్రహ్మచారికి వచ్చిన రుగ్మతయు దానితో నీ బొమ్మ సామ్యమును ఆమెకు స్ఫురించినవి.

వాఘిరా మనస్సుకూడఁ దెలిసికొన రాణి యత్నించినది కాని యవగతము కాలేదు. ఐనను తొందరయేమి? తన కా చిత్రము కంటఁ బడకుండ వాఘిరా చేసిన యత్న మామె కిప్పు డర్థమైనది. రాణి కొండప ద్వేషకథ తెలిసికొన్నను ముఖమున నేమాత్రము కోపము వ్యక్తము కానీయలేదు. ఆమె నిర్ణీతప్రకారము చిత్రశాల పూర్తిగా దర్శించినది.

ఆ మఱునాఁటి యుదయముననే శ్రీ సత్యాశ్రయపుల కేశి వల్లభులు తమ యేకాంత మందిరమునకుఁ గొండపను బిలి పించి యాతనికిఁ బారితోషికముగా నయిదువేల సువర్ణము

లిప్పించి, "నీవిఁక మా చిత్రశాలలో నుండవలసిన పనిలేదు. నీవు వెళ్ళఁదలఁచిన చోటికి మా యాశ్విక భటులు సురక్షిత ముగాఁ జేర్పఁగలరు. ప్రయాణమునకు సిద్ధమగుట కొక జాము వ్యవధి చాలు ననుకొందుము!" అని సెలవిచ్చిరి.

మహారాజు మాటలకుఁ గొండప నిర్విణ్ణుఁ డయ్యెను. ఆతని నోట మాట రాలేదు. మాట్లాడఁ దలఁచుకొన్నను, అందుల కవకాశము లేకుండ, మహారాజుమాటలు ముగిసినదే తడవుగా ద్వారపాలకుఁ డాతని నావలకుఁ గొంపోయెను.

కొండప నిస్తబ్ధుఁడై యభ్యాసవశమునఁ జిత్రశాలకుఁ బోయి కూర్చుండెను. ఆతఁడు ప్రయాణప్రయత్నము లేవియుఁ జేయలేదు. ఆతని కాలోచించుటకైన మనస్సు మొద్దు వాఱి నది. వాఘిరా నొకసారి చూడవలె ననికూడ తోపకుండినంత స్తబ్ధుఁడయ్యెను. వాఘిరా యాతనిఁ జూడ రాలేదు.

అట్లతఁ డెంతకాలము కూర్చుండెనో యతని కెఱుక లేదు. రాజమందిరమున గడియారమునఁ గొట్టు గంట లాతఁడు విని పించుకొనలేదు. అంతమాత్రమున గడియారమున గంటలు మ్రోయుట లేదు. రాజభటులు కాలగమనము కనిపెట్టు చునే యుండిరి. మహారాజు పెట్టిన గడు విఁక సరగడియ యున్నదనఁగా నాశ్విక భటులు వచ్చి, 'సిద్ధముగా నుంటివా?' యని కొండపను హెచ్చరించిరి.

కొండప కేమియుఁ దోపలేదు. ఆతఁడు నిద్ర మైకమున నున్న ట్లట్లే కదలకుండుట చూచి, రాజభటులే యాతని తూలి

కలు రంగుల పాత్రలు వస్త్రములు కట్టి కట్టి, యాతని సువర్ణములతోఁ జాటొక యశ్వము మూఁపున వ్రేలాడవేసి, కొండపను తెక్కలు పట్టుకొని నడిపించుకొనిపోయి యాగుట్టముపైఁ గూర్చుండఁ బెట్టిరి.

ఇటు లాతని నెక్కడికిఁ బోదువని యడిగినను, ఆతఁ డుత్తర మీయనందున వారతనిని సంఘారామమునకుఁ దీసికొనిపోయి యింటికడ విడిచి వచ్చిరి. ఇరువది దినములు పట్టిన యా ప్రయాణ మధ్యకాలమున నిరువది మాటలైనఁ గొండప మాట్లాడినట్లే లేదు.

## 19

అప్పటికిఁ గొంతకాలమునుండి శ్రీసత్యాశ్రయపులకేశివల్లభుల రాజ్యమం దంతట యుద్ధప్రయత్నములతో సందడిగా నున్నది. రాజధానియగు వాతాపి నగరమున సందడి మఱింత యధికమైనది. పులకేశివల్లభుఁ డుత్తరదేశ దండయాత్ర చేయనుండుటచేఁ, దన సామంతు లందఱకుఁ దమతమ సేనలతో గోదావరీతీరమున నాసికయొద్ద సమావేశము కావలెనని యాజ్ఞాపత్రిక లంపి యుండెను. నిర్ణీత కాలమునకు సామంతు లందఱుఁ దమ తమ సేనలతో నాసికాక్షేత్రమునఁ జేరికొనిరి. వేంగీరాష్ట్రము నుండి, యక్కడ నిప్పుడు రాజప్రతినిధిగా నున్న కుబ్జవిష్ణు

వర్ధనుఁడు ప్రచండసేనతో వచ్చి, మహారాజుల రాకకై యెదురు చూచుచు, మిగిలిన సామంత దండనాథులఁ గూర్చుకొని యాత్రాసన్నాహములు సమీచీన మొనర్చుచుండెను.

సత్యాశ్రయపులకేశివల్లభుఁడును రాజధానీ నగర మగు వాతాపికి శత్రువగు పల్లవమహేంద్రవర్మవలన నాపద రాకుండ రక్షణకై సేన లుంచి, తక్కిన మహాసేనతో నాసిక చేరికొనెను. అప్పటికే సోదరుఁడగు కుబ్జవిష్ణువర్ధనుఁడు సర్వసన్నాహములు చేసి యున్నాఁడు. ఐనను మరల మహారాజు వచ్చిన పిమ్మట, సేనల నన్నిటిని బారులు తీర్పించి, లెక్కపెట్టించి యే యే సేనాభాగమున కెవరెవరు నాయకులో నిర్ధారణచేసెను.

సేనాంగము లన్నింటిలోఁ జిన్నది పత్తి. మూడుపత్తు లొక సేనాముఖము. మూఁడు సేనాముఖములు కలసిననొకగుల్మము. మూఁడు గుల్మములు కలసి యొక గణము, మూఁడు గణము లొకవాహినియు నగును. మూఁడు వాహిను లొకపృతన యౌను. మూఁడు పృతనలు కలసిన దానిని చము వనియు, మూఁడు చమువులు కలసిన దొక యనీకినియు నందురు. అట్టి యనీకిను లిప్పుడు పది లెక్క తేలినవి. సేనాభాగముల సంఖ్య లలో మహాభారతకాలము నాఁటి సంఖ్య కొంత మాఱినది. అప్పటి రథసంఖ్య తగ్గి దానికి బదులు హయసంఖ్య పెరిగినది. సేనాభాగములకుఁ బూర్వనామము లట్లే నిలిచి యున్నవి.

ఈ బలములు పరీక్షచేయుటకు మహారాజులకుఁ బదిదిన ములు పట్టినది. అవి నిలిచి తనకు వందన మొనర్చు తీరుననే,

మహారాజు వాని బలాబలములు గ్రహించుచు, బలహీన మైన వానిఁ బటిష్ఠము లొనర్చు నుపాయము లాయాచమూపతుల కప్పుడప్పుడే సూచనలు చేయుచు సేనాపంక్తుల నడుమ తన యశ్వరాజముపైఁ బోయెను. మరలఁ దిరిగి వచ్చునప్పటి కా సూచన లాచరణలోఁ బెట్టినది లేనిది సూక్ష్మముగా గ్రహించి, పెట్టనివారిని గట్టిగా మందలించు చుండెను.

సేనాపరీక్ష పూర్తిచేసి, పిమ్మట నింతటి సేనకు యాత్రా మధ్యమున విశ్రమ భోజనాదులకు వలయు సామగ్రి పరిశీలిం చుట మఱియొక పదిదినములు పట్టినది. ఖడ్గాద్యాయుధములు చేయువారు, బాగుచేయువారు, బాణములు విండ్లు సిద్ధము చేయువారు, కమ్మరులు, వడ్రంగులు, ఖనకులు, శిల్పులు,— ఎవరి పని వారు సక్రమముగాఁ గొనసాగించుకొనుటకు పరికర ములతో సంసిద్ధులై యున్నది లేనిది పరీక్షించినాఁడు.

ఇట్లు సేనాసన్నాహములు చూచుచు, రాజ్యమున నన్ని దిశలనుండి దూతలు తెచ్చు వార్తలు జాగరూకుఁడై మహా రాజు పరిశీలించు చుండెను. అన్నిటికంటె ముఖ్యముగా హర్ష వర్ధనుని సేనాచలనములఁ గూర్చి తెచ్చు చారుల వార్తలు విశేష శ్రద్ధతో నాలకించు చుండెను.

హర్ష వర్ధనుఁడు మహాయోద్ధ. అతఁడు వింధ్యోత్తర భూమి నంతటిని జయించి, దక్షిణదేశముపైఁ గదలి రావలె నను యత్నములో నున్నాఁడని తెలియుటచేత నే, పులకేశివల్లభుఁడు వింధ్య దాటి యుత్తరదేశముపై దండెత్తి, యాతనికి గుణ

పాతము చెప్పవలె నను కుతూహలముతో నీ యాత్రా సన్నాహము లొనర్చి యుండెను. హర్షవర్ధనుని సేనలు నర్మదానది దాటి దక్షిణభూమిలో నడుగు వెట్టరాదు; తాను నర్మద తరించి, వింధ్యపర్వతములు దాటి, మాళవఘూర్జర దేశములపై దండెత్తవలె నని పులకేశి సంకల్పము.

శ్రీ హర్షవర్ధనుఁడు కూడ వేదమతానుయాయి యైనను కొంతకాలమునుండి మహాయాన బౌద్ధశాఖయం దభిమానము పెంచుకొనుచున్నాఁడని పులకేశివల్లభులకుఁ దెలియ వచ్చినది. పులకేశిరాజ్యములో యాత్రలకుఁ గీలకస్థానములలో నున్న అజంతా ఎల్లోరా మొదలగు సంఘారామములు మహాయాన బౌద్ధశాఖకు నిలయములు. అందుచే హర్షవర్ధనుని సేనలకు చారులకు నచ్చట స్థావరములు దొరకు నేమో పరీక్షించి, యవసరమగు ప్రతిక్రియ లొనర్చుటకే, వెనుక మహారాజు రాణువతోఁ గదలి వచ్చి యా ప్రదేశములు తీక్ష్ణముగాఁ బరిశీలించి పోయియుండెను. ఇప్పుడు చారు లింకను సంఘారామము లన్నిటిని బరీక్షించుచు మహారాజునకు వార్తలు చేర్చుచున్నారు. ఐనను సంఘారామములలో రాజద్రోహ చర్యలు జరుగుచున్న వార్త లేమియు నింతవఱకు రాలేదు.

ఈ మహాప్రయత్నములలో మహారాజునకు విశ్రమింపఁ దీఱిక లేకున్నది. సామాన్యముగా నాతఁడు నిద్రించు జామున్నరకాల మైన నిప్పుడు నిద్రవోవఁ దీఱుబడిలేదు. మహారాజులతో మహారాజ్ఞియు నంతఃపుర జనమును గదలి వచ్చిరి.

రాణి పరివారములో వాఘీరాయును గుజ్జియు నున్నారు. యుద్ధప్రయత్నము లన్నిటిలోఁ బట్టమహిషి సర్వవిధముల మహారాజులకుఁ దోడవుచున్నది.

తన పరివారము యుద్ధక్షమముగా నుండుటకై, రాణి పరిజనుల నందఱ ఖడ్గాది రణ సాధనము లభ్యసింపుఁడని శాసించినది. ఇతర విద్యలవలెనే వాఘీరాకు ఖడ్గవిద్య శీఘ్రముగా నలవడినది. అది చూచినకొలఁది రాణి కీమధ్యఁ జిత్రశాలా దర్శనమాదిగా వాఘీరాయెడఁ గలిగిన యప్రసన్నభావ మొకించుక వెనుకఁ బట్టిన ట్లున్నది. వాఘీరా నృత్యము చేయునప్పుడు, దాని కన్నులు మిణుగురు పురుగులవలె మిలమిలలాడును. ఇప్పు డది ఖడ్గము ద్రిప్పుచుండఁ గాలమేఘములో విద్యుల్లతవలె, దానిచేతులలో నసిలత తళతళ లాడుచుండును. అంతఃపుర రక్షణమునకు వాఘీరా ఖడ్గము శ్రీరామరక్ష యని, రాణి యప్పుడప్పు డనుచు వాఘీరాముఖము క్రీఁగన్నులఁ బరీక్షించు చుండెను.

సత్యాశ్రయపుల కేశివల్లభమహారాజు లిట్లు సేనలను సంభారములను సమీకరించిన మొనర్చుకొని, జ్యోతిష్కులు నిర్ణయించిన శుభముహూర్తమున గోదావరీనది దాటి, యజంతా విహార సమీపమునఁగల కనుమల దారిఁబట్టి నర్మదానదీ తీరమునకు దండయాత్ర సాగించి తన మహాసేనతో దక్షిణ తీరమున విడిసెను.

# 20

కొండప సంఘారామము చేరఁగనే తనకు మహారాజిచ్చిన యైదువేల సువర్ణములు ధారణీమాయి కర్పించెను. అతఁడెక్కువ మాటాడలేదు. దృఢముగాఁ బర్వతమువలెఁ బెరిగిన యాతని దేహము నాతని తల్లి తన రెండు బాహువులతోఁ బొదివి గాఢాలింగన మొనర్చుకొని, యానందబాష్పములతో ముంచెత్తి ముద్దాడినది. వాఁడింత పెద్దవాఁడుగా మారినను ఆతల్లి కింకను జిన్నవాఁడుగనే తోఁచుచుండెను.

ఇంతలోఁ దండ్రి యక్కడికి రాఁగా, నామె తన కుమారుఁడు తెచ్చిన సువర్ణము లశోకున కర్పించెను. ఆ యమాయకురాలికిఁ గొండప సంతోషముగా లేఁడని తోఁచనైన లేదు. తండ్రి మాత్రము తన ప్రశ్నలకుఁ గుమారుఁ డిచ్చుచున్న సంగ్రహ సమాధానములచే, నతఁడింత ధనముతో వచ్చినను, అక్కడ నవమానము పొందియుండు నని యూహించియు, వాని నప్పుడు బాధపెట్ట నిష్టములేక నెమ్మదిగా వృత్తాంతము తెలిసికొనవచ్చును లెమ్మని యప్పటి కూరకుండెను.

కొండప మఱునాఁటి యుదయముననే కుమారశ్రీనాథుని దర్శింపఁ బోయి, యాతని పాదములఁ గన్నీటితో ముంచివేసెను. కుమారశ్రీ యిప్పుడు స్వస్థుఁడై సంఘారామ వ్యవహారము లన్నియు, సంఘజిత్తు జోక్యమేమియు లేకుండఁ దానే చూచుకొనుచుండెను. ఆతఁడు కొండప దుఃఖకారణ

మూహించి ముందుగా, "నాయనా, వాఘిరా బాగున్నదా?" యని ప్రశ్నించెను.

"దేవా, వాఘిరా యిప్పుడు వెనుకటి వాఘిరా కాదు. అది యిప్పుడు వాఘిరాయే కాదు. పంజరములోఁ జిక్కిన చిలుక యైనది."

"దానిని బంధించినారా, అయ్యో! ఎవరు? ఏల?"

"వేఱ బంధన మెందులకు? అదియే యంతఃపుర జీవితములో స్వయముగాఁ దన్ను బంధించుకొన్నది."

"కొండపా, నీ మాట లర్థ మవుటలేదు."

"ఏమున్నది తండ్రీ! స్వేచ్ఛగా సెలయేటివలె గంతులు వేసెడి వాఘిరా యిప్పుడు రాజపుత్రిక యైనది. తీర్చి దిద్ది సింగారించుకొనును. ఒడలెల్ల నగలు ధరించును. దాని మాటలు సున్నితమై కొంచెమైనవి. ఒక్కపొల్లుమాటాడదు. ఒంటరిగా నాతోఁ గూడఁ దిరుగదు. అక్కడ బ్రహ్మచారి యీశ్వరపూజ చేసి యిచ్చిన తీర్థప్రసాదములు మహాభక్తురాలివలె సేవించును. నన్ను సేవకునిఁ జూచినట్లే చూచినది–"

ఈ విధముగాఁ దన గొడవ యంతయుఁ గొండప వెళ్ళఁ బోసికొనుచుండ, నాలించిన కుమారశ్రీనాథునకు వాఘిరా యంతఃపురములో సుఖముగా నున్నదని యవగాహన మైనది. కొండప తనకుఁ దెలియకుండఁగనే వాఘిరాను ప్రేమించుచుండెననియు, వాఘిరామాత్ర మాతనిఁ దన చిన్ననాఁటి

మిత్రునిగా మాత్రమే యాదరించుచున్న దనియు, బుద్ధిశాలి యగు కుమారశ్రీ యూహించెను.

"పాపము పిచ్చికొండప్ప!— ఇతనిని భగవానుని ప్రసాద మైన వాఘిరా కామించునా?— అది పవిత్రమైన బిడ్డ. దానికీ లోకసంబంధ మైన మాలిన్యము లంటునా ?— దాని సంగతి యీ పసివాని కేమి యెఱుక ?— " ఈ విధముగాఁ గుమార శ్రీ మనస్సులో ననుకొని దీనముగా విలపించుచున్న కొండప నాదరముతో నోదార్చి, "నాయనా, వాఘిరా యెక్కడ నున్న నెట్లున్న భగవానుని ప్రసాద మని మఱువ వద్దు!" అని యుపదేశించెను.

"ఇప్పుడు వాఘిరా భగవానుని ప్రసాదము కాదు. భగ వానుని ప్రసాదము రాణికి వినయవిధేయతలతో సేవలు చేయునా? పూజకు వచ్చిన బ్రహ్మచారిని పరిచారికవలె ననుస రించునా ?"

ఆ మాటలకుఁ గుమారశ్రీనాథుని హృదయములో నించుక కలఁక కలిగినది. కాని యాతఁడు మనస్సు కుదుర్చుకొని, "కాదు, కొండపా! అది భగవానుని ప్రసాదము వారిపైఁ జూపు నను గ్రహము — కటాక్షము! భగవానుని లీలలు బహుకాల మవగాహన మొనర్చుకొనఁ దపస్సు చేసిన మాకే పూర్తిగాఁ దెలియవు. పసివాఁడవు నీ కేమి యెఱుక!—" అనెను.

వారట్లు సంభాషించు చుండఁగనే ద్వారపాలకుఁ డగు శిష్యుఁడు వచ్చి నూతనాగంతుకులైన పెద్ద లధ్యక్షుల దర్శింప

వేచి యున్నారని నివేదింప, వెంటనే రమ్మని కుమారశ్రీ యనుజ్ఞ యిచ్చెను.

ఆ వచ్చిన నూతనపురుషుఁడు తనపేరు మేఖలకుఁడని చెప్పి, సంఘాధ్యక్షులకు సాష్టాంగదండప్రణామ మాచరించి, యేకాంతముగాఁ గొంత మనవి చేసికొన ననుజ్ఞ వేఁడెను.

"మాయొద్ద రహస్యములు లేవు. ఈ కుబ్జవాఁడు మా కుమారునివంటి వాఁడు. చెప్పఁ దలఁచినది నివేదించుకొన వచ్చును!" అని కుమారశ్రీ చెప్పెను.

నూతనపురుషుఁడు :"చతుస్సముద్రముద్రిత సమస్తవసుమతీ నాథులు (శ్రీ) సమ్యాసంబుద్ధుల పాదపద్మారాధకులు నగు శ్రీహర్షవర్ధన శీలాదిత్య చక్రవర్తులు వారికి దేవరవారి యెడఁ గల భక్తికిఁ జిహ్నముగా నీ పదివేల సువర్ణములు తమ పాద సన్నిధిని సమర్పింప నీ దాసునిఁ బంపియున్నారు." ఇట్లాతఁడను చుండ నాతని వెంట వచ్చిన మువ్వురు సేవకు లాసువర్ణములు బంగరు పళ్ళెరములోఁ గుమార శ్రీనాథుని పాదములముం దుంచి వెడలిపోయిరి. కుమారశ్రీనాథుఁడు క్షణ కాలము మౌనముగా ధ్యానస్థితుఁడై యుండి యా రాయ బారితో నిట్లనెను.

"శ్రీహర్షవర్ధనులకు భగవానునియెడఁ గల భక్తికి సంతోషమైనది. కాని మేము తప మొనర్చుకొనుచున్న యీ కుంతలదేశము పాలించుచున్న శ్రీ సత్యాశ్రయపులకేశి వల్లభులకును, మీ ప్రభువులగు శ్రీ హర్షవర్ధనులకును, ప్రస్తుతము

యుద్ధప్రయత్నములు జరుగుచున్న వని వినియున్నాము. ఇట్టి సమయమున మీ ప్రభువు లెంత చిత్తశుద్ధితో నంపిన కానుక లైనను మేము స్పృశింపరాదు—అటు చూడనైనఁ జూడము!''

ఇట్లనుచుఁ గుమారశ్రీనాథుఁడు కన్నులు మూసికొన, మేఖలకుఁ డేదియో యనఁబోవుచుండుట గమనించి, కన్నులు తెఱవకయే మరలఁ గుమారశ్రీనాథు లిట్లనిరి:

''మా యాశీర్వచనములు కూడ శ్రీసత్యాశ్రయ పులకేశి వల్లభుల యెడనే ప్రవర్తిల్లఁ గలవు. తపస్వుల తపఃఫలములో నాఱవపాలు వారిని రక్షించు ప్రభువులకే చెల్లునని ధర్మవేత్త లగు మీ శీలాదిత్య ప్రభువులకుఁ దెలియకుండునా? అనవసరముగా యుద్ధప్రయత్నములకు మీ ప్రభువులు దిగకున్నచో, మాకు సత్యముగా హర్షవర్ధనులు కాఁగలరని మీ ప్రభువులకు మా యాదేశముగా విన్నవించి, సమ్యాసంబుద్ధుని ధర్మశాసన మిట్లున్న దని చెప్పి యీ పత్ర మర్పింపుము!"

ఇట్లనుచు 'ధమ్మపదము' నుండి,

*"జయం వేరం పసవతి
దుక్ఖం సేతి పరాజితో
ఉపసన్తో సుఖం సేతి
హిత్వా జయ పరాజయమ్"

*'జయము వైరమును బుట్టించును. పరాజయము దుఃఖము కలిగించును. జయ పరాజయములు వదలి ఉపశాంతుఁ డగువాఁడు సుఖించును.' ధమ్మపదము : సుఖవగ్గము. శ్లో. ౫

అను సూక్త భాగమును గొండపచే భూర్జపత్రముపై మనో హరముగా వ్రాయించి రాయబారి కిప్పించి పంపివేసెను. ఎన్నియో రాజకార్యములు రాజదూతగా నుండి సమర్థతతో నిర్వహించిన మేఖలకుఁ డిప్పుడు గత్యంతరము లేక, యీమాటు లఘువుగా నధ్యక్షులకు నమస్కారము చెప్పి, సేవకులచే సువ ర్ణములు పట్టించుకొని, చిన్నవోయిన ముఖముతో వెడలి పోయెను. రాయబారి యావలి కేగువఱకుఁ గుమారశ్రీ నాథుఁడు కన్నులు తెఱవనే లేదు.

ఆనాఁటి సాయంకాలమునుండి కొండప సంఘారామ ములోఁ గనిపింపలేదు. తల్లి దండ్రులకుఁగాని, సోదరులకుఁగాని, తుదకుఁ దన చిన్న చెల్లెలికిఁగాని, చెప్పకుండ రహస్యముగాఁ బోయి, యా రాయబారి నాతఁడు పోవుచున్న మార్గమధ్య మునఁ గలసికొని, తన్ను శ్రీహర్షవర్ధన చక్రవర్తుల సేనలోఁ జేర్చికొమ్మని యర్థించెను. కండలు తిరిగి కొండవలెఁ బెఱిగిన కొండప శరీరదార్ఢ్యము చూచి, మేఖలకుఁడు సంతోషముగాఁ దన పరివారమునఁ జేర్చికొనెను. అతఁడు బహుకాలము పుల కేశి రాజప్రాసాదములోఁ జిత్రకారుఁడుగాఁ బనిచేసి యుండె నని రాయబారి యెఱిఁగినంతనే, యతిశయించిన యాదరముతో నాతని శ్రీహర్షవర్ధను లున్న స్కంధావారమునకు రాజ దర్శ నార్థము కొంపోయెను.

తన్ను పరాభవించిన సత్యాశ్రయపులకేశి వల్లభుల మీఁదను, రాణిమీఁదను కొండప యీ విధముగాఁ గత్తికట్టె

తనకసి తీర్చికొన నుద్దేశించెను. వాఘీరా నంతఃపుర శృంఖల ముల నుండి విడిపింపఁ జాలుదునని కూడ కొండప యోచింపక పోలేదు.

వింధ్యపాదమున నర్మదానది కనతి దూరమున, శ్రీహర్ష వర్ధనుల స్కంధావారము మహానగరమువలె శాతకుంభము లున్న వెలిగుడారములతో, సుగుప్తమగు స్థానమున నున్నది. మేఖలకుని వెంట కొండప మదగజయూథములను, అశ్వమం దురములను చూచుచు, దర్పశాత మను ప్రసిద్ధనామము గల హర్షవర్ధనుని భద్రదంతావళము దర్శించి యానందించుచు, మూడు కక్ష్యాంతరములు దాటి, శ్రీహర్షవర్ధన చక్రవర్తిని గాంచి ప్రణమిల్లెను. శ్రీహర్షవర్ధనులు మేఖలకుఁడు నివేదించిన వాక్యములు విని కొండప నించుక ప్రశ్నించిరి. కొండప యుత్త రము లాలకించి చక్రవర్తి సంప్రీతుఁడై, యాతనిపై మహా కార్యభార ముంచఁ దలంచితి మని సెలవిచ్చి, యందుకుఁ దగిన రణశిక్షణ మొసంగ భటుల కాజ్ఞాపించి, కొండపను బంపివేసి, యేకాంతమున మేఖలకునితో మంతన మాడెను.

# 21

వింధ్య పర్వతపాదమం దుపలవిషమమై విశీర్ణమై నర్మదానది ప్రవహించుచున్న దని మహాకవి కాళిదాసు తన మేఘదూత

కావ్యములో వర్ణించినాఁడు. దాఁటులతోఁ బోవున దను వ్యుత్పత్త్యర్థము కల రేవానామము కూడ దానికే కలదు. ఈ నర్మదా నదీ పవిత్రజలములలో నీటితాఁకున నున్ననై మెఱుఁగు లీను శిలలను నర్మదబాణములను పవిత్రనామముతో స్వయంభూశివలింగమూర్తులుగా భావించి విశ్వమంతటఁ బూజించుచున్నారు.

ఆ నర్మదానది కిరువైపుల నిప్పుడు రెండు మహాసేన లాటోపముతోఁ జేరియున్నవి. దక్షిణదేశము జయించు కుతూహలముతో, శ్రీహర్షవర్ధన చక్రవర్తి మహాసేనతో నర్మదా నది యుత్తరతీరమున విడిసియున్నాఁడు. అతఁడు మహావీరుఁడే కాక మహాకవి. కాదంబరీ కావ్యకర్త యగు బాణభట్టునకు, మయూరాది కవులకు, నాశ్రయ మిచ్చిన రసజ్ఞుఁడు. భోగములు వర్జించి సామ్రాజ్యము పాలించుచున్న చక్రవర్తి. ధర్మప్రభు వని విదేశయాత్రికులచే పొగడ్త లందిన యశస్వి. అతని సేనాధిపతి భండి మహాసమర్థుఁ డని జగద్విఖ్యాతి కన్నవాఁడు.

నర్మదానది దక్షిణతీరమున, మధ్యభారతభూమి నంతటిని జయించి యేకచ్ఛత్రాధిపతియై యేలుచున్న సత్యాశ్రయపుల కేశివల్లభుఁడు మహాసేనతో విడిసి, యుత్తరభారతము జయింప నువ్విళ్ళూరుచున్నాఁడు. అతఁడు రాష్ట్రకూటులను కదంబులను జయించెను. కాంచీపుర పల్లవరా జగు మహేంద్రవర్మ నోడించి, వేంగీరాష్ట్రము నాతఁడు తన రాజ్యములోఁ గలుపుకొని, తమ్ముఁడగు కుబ్జవిష్ణువర్ధను నచ్చట రాజప్రతినిధిగా

నుంచెను. కుబ్జవిష్ణువర్ధనుఁ డాతని సర్వసేనాధిపతియై యసాధ్యములగు ననేక స్థలజలదుర్గములు పట్టుకొని 'సర్వసిద్ధి' యను ప్రతాపనామ మందిన వీరుఁడు.

'అహింసా పరమో ధర్మ' యని బోధించు వేదధర్మ మవలంబించు పులకేశికి బౌద్ధమతద్వేషము లేదు. అట్లే యహింస పరమధర్మ మని ప్రకటించు బౌద్ధ ధర్మ మభిమానించుచున్న హర్షవర్ధనుఁడు వైదిక మతానుయాయియే. వారిరువురకును రాజ్యతృష్ణ శత్రువిజిగీష సమానముగనే కలవు.

ఇద్దఱును మహావీరులు. ఇద్దఱకు నుత్సాహశక్తి, ప్రభుశక్తి, మంత్రశక్తి, సహాయసంపద ఉన్నవి. ఇద్దఱకును బరస్పర జయకాంక్ష యున్నది. వారిద్దఱ సేనలకు నర్మదాతీరమున జరిగిన మహాయుద్ధము చరిత్ర ప్రసిద్ధము. నర్మదానది కిరు పార్శ్వముల నున్న యరణ్యప్రదేశములలోఁ గొండల చాటున, గుట్టలమాటున, పొదల వెనుకఁ, బుట్టల వెంబడి, వృక్షచ్ఛాయల యోజనము పొడవున నిరువాగు విడిసి, యొక దానితో నొకటి ఘోరముగాఁ దలపడినవి. ఆ యుద్ధము వారముల పొడవున సాగినది. గజములమీఁద, నశ్వములపైని, పుట్లలోనను, నర్మదానది నుభయపక్ష సైనికులు దాటి యావలి సేనలతోఁ దలపడుచున్నారు. నర్మదానది దాటు వారిని నది దాటు లోపలనే యావలివా రడ్డగించి ప్రతిఘటించుచున్నారు. ఇరువైపుల నదీజలములలో, శత్రుసేనలకుఁ గనపడకుండ,

కొమ్ములవలెఁ జెక్కిన కఱ్ఱలు తీరము వెంబడిఁ బాతించు చున్నారు. ఇట్లే శత్రునాశనమున కనేకమార్గము లవలంబించు చున్నారు.

# 22

సేనలోఁ జేరిన దాది, కొండప యితరము సమస్తము మఱచి, యాయుధసాధనమే కాక, వ్యూహనిర్మాణము, వాహినుల నడపుట, యిత్యాది రణవిద్య లన్నియు శ్రద్ధతో నభ్యసించి నేర్పు సంపాదించెను. ఒకనాఁ డతనికి హర్షవర్ధనుఁ డేకాంతముగా దర్శన మిచ్చి, పులకేశివల్లభుని పట్టమహిషిని పట్టి తెచ్చు కార్యభార మాతనిపైఁ బెట్టి, వాహినీపతి పదవి యనుగ్రహించెను. కొండప 'మహాప్రసాద'మని చక్రవర్తి పాదము లంటి యాకార్యము సాధింతు నని కఠోరప్రతిజ్ఞ చేసెను. తనపై నా భార ముంచుట యదృష్టవశమున లభ్యమైన దని భావించుచు, కొండప రాత్రిం దివము నా ప్రయత్నముననే నిమగ్నుఁ డయ్యెను.

ఆతఁడు జాగరూకుఁడై పులకేశివల్లభుని మహారాజ్ఞి పరివారముతో నే వైపున నున్నదో వార్తలు సంగ్రహించుచు, నటువైపునకే తన వాహినిలోని గణపతుల నడువ నాజ్ఞాపించు

చున్నాఁడు. కాని యాతని వాహిని యెప్పుడు నర్మదానది దాట యత్నించినను, రాణి పరివారము దాని నరికట్టుచున్నది.

అతికాయునివలె నున్న యున్నతకాయుఁడగు శత్రువాహినీ పతి యొకఁ డెవఁడో తన పరివారమును వెంటాడుచున్నాఁ డని రాణి పసి పట్టినది. ఆమె సూక్ష్మదృష్టి కాతఁ డెవరో తాను పూర్వ మెఱిఁగిన వాఁడని గోచరించినది. కవచశిరస్త్రా ణములలో మఱుఁగుపడి యున్నను, ఆతని యెత్తు, నడక, యవయవముల కదలిక, జ్ఞాతపూర్వకముగా గోచరించినవి.

కొండపను బంపివేసిన మొదటి దినములలోకంటె నిప్పు డించుక మెఱుఁగైనను, మహారాజ్ఞి కింకను వాఘిరాయెడ వెనుకటి యనుగ్రహము రాలేదు. ఆమె దాని చర్య లన్నియు నొక కంటఁ గనిపెట్టుచునే యున్నది. ఇప్పుడొకనాఁడు రాణి వాఘిరా నిట్లడిగినది. "వాఘిరా, ఆ వాహినీపతి యెవ్వరో, యెప్పుడో నేను వెనుక చూచినట్లున్నది. నీ కేమైన నెవరో యూహకుఁ దట్టుచున్నదా ?"

వాఘిరా తలవంచుకొని యమాయికముగా, "మహారాజ్ఞీ, నా కేమియు గుర్తు తగులుట లేదు." అని యుత్తర మిచ్చినది. అట్లది యన్నదే కాని కొండప నెన్నఁడో గుర్తించినది. ఆతని ప్రయత్నమును గ్రహించినది. కృతఘ్నతతోఁ గూడిన యా పిశాచ ప్రయత్నమునుండి యతని నెట్లైన విరమింపఁ జేయుట కది యెన్నియో యుపాయము లాలోచించినది. ఒక మాఱది వింట బాణము సంధించి, దానికి లేఖాపత్రము తగిలించి, కొండప పట కుటీరములోనికి వదలినది. కొండప యాపత్రము

చదివిన ట్లున్నాఁడు. రెట్టించిన క్రోధముతో నారాత్రి యతఁడు తన వాహినిని రేవానది దాటింప యత్నించి విఫల మనోరథుఁ డయ్యెను.

మహారాజ్ఞి మంచి పట్టుదల గలది. ఆమె కొండపను గుర్తింపక పోలేదు. వాఘిరా యాతని గుర్తించిన దనియు నామె గ్రహించినది. దాని చర్యలు పరీక్షింప నియుక్తయైన కుబ్జ యది యాతని కేదో వార్త లంపుటకు యత్నించుచున్న దని చెప్పియుండెను. వాఘిరా తన మిత్రునికిఁ దన్నుఁ బట్టించుటకు రహస్యవార్త లంపుచున్న దనియే రాణి భావించినది. అందుచేత కొండప నెట్లైనను బంధించి, యాతనితోఁబాటుగా వాఘిరాను శిక్షింపవలె నని రాణి నిశ్చయించినది.

కొండప నడపుచున్న వాహిని విడిసియున్న వనప్రదేశమున కెదురుగా నున్న గుట్టపై నొకనాఁడు మహారాజ్ఞి విలాస శిబిర మేర్పాటు చేయించినది. సాయంకాలము మూఁడు జాములైనప్పటినుండియు, ఆ గుట్టపైకి స్త్రీజనము విలాస ద్రవ్య సంభారములతోఁ జేరుచు, నాట లాడుచుఁ బాటలు పాడుచున్నారు. చీఁకటి పడినంతనే పెద్ద దివిటీల వెలుఁగున రాణి సర్వాలంకారశోభితయై, యందఱకు స్పష్టముగాఁ గనఁబడునట్టులా విలాస పటకుటీరము ప్రవేశించి, యాటపాట లాలించుచు, మధ్యమధ్య బయటికి వచ్చుచు, లోని కేగుచుఁ గ్రీడాపరవశయై కనుపించుచున్నది.

నది కావలిగట్టున నున్న వాహినిలో కొండప కదలికలు వాఘిరా గమనించినది. ఆతఁ డారాత్రి తన వాహినితో

రాణియున్న కొండగుట్టపైకి దండెత్తి రా నున్నాఁడని యూహించినది. పాపము, రాణికి మహాపద రానున్న దని వాఘిరాకు తత్తరము కలిగినది. అట్టిది జరుగకుండ నెట్లైన రాణిని రక్షింప నిశ్చయించుకొన్నది. తానే పోయి కొండపను బ్రతిమాలి, యాతఁడు వినకున్నఁ జిన్నతనమునందు వలె అక్కఱ, కఱచియైన, నాతని నా ప్రయత్నమునుండి విరమింపఁ జేయ నిశ్చయించినది. అందులకై అది రాణి కంటఁబడకుండ రేవానది దాటు టెట్లా యని యాలోచించినది.

రాత్రి జాము న్నర ప్రొద్దుపోయినది. రాణి చెలికత్తెలతో లీలావినోదములతో మైమరచిన ట్లున్నది. ఆవల కొండప వాహినిలో సందడి క్షణక్షణము నతిశయించుచుండుట, వాఘిరా తన సూక్ష్మదృష్టితోడను, సూక్ష్మతరము లగు శ్రవణములతోడను, దెలిసికొని యావేగము పట్టలే కున్నది. అది సర్వాలంకృతయై మహారాజ్ఞిని సేవించుచునే, నెమ్మదిగా నటనుండి జారి, మహావేగముతో గుట్ట దిగి, నర్మదాతీరము చేరికొన్నది. అక్కడ నొక పొదచాటున డాఁచి యుంచిన పుట్టి నెక్కి త్రోయసాగినది. ఆ పుట్టి దాని మనస్సువలెనే సుళ్ళు తిరుగుచు నర్మదానది యుత్తరతీరము చేరినది.

ఎవరో దేవతవలెను రాణివలెను అమూల్యభూషాలంకృత యై, నీలాంజనరూపముతో మెఱపుఁదీఁగలతోడి కాలమేఘము వలె, నిర్భయముగా నొంటరిగా నట్లు వచ్చుచున్న యాయువతిని జూచి, యద్భుతాశ్చర్యమగ్నులై కొండప భటు లెవ్వరు వారింపలేదు. వారు తన్నడ్డగించు యత్నము చేయు లోపలనే,

వాఘిరా కొండప పటకుటీరములో రివ్వున బాణమువలెఁ బ్రవేశించినది.

అప్పుడు కొండప యుద్ధమునకు సర్వసన్నద్ధుఁడై కవచము శిరస్త్రాణము ధరించి, యొఱనుండి కత్తి తీసి, దీపపు వెలుఁగున దాని మెఱపులు పరీక్షించుచు, నానాఁటిరాత్రి తాను చేయ నున్న రణక్రమమును గూర్చి యాలోచించుచు, రాణి నీ విధ ముగా బంధింతు నని కలలు కనుచున్నాఁడు. ఆతఁ డట్లు పరీక్షించుచున్న కత్తి మెఱుగులో వాఘిరా కన్నులు రెండును మిలమిల లాడుచుఁ బ్రతిఫలించినవి. తన కన్ను లాతఁడు నమ్మలేక యాలకించునంతనే, యాతనికి జిరపరిచిత మగు వాఘిరా పదధ్వని వినవచ్చినది. పూర్వ మా పదధ్వని విన్నంతనే యాతని హృదయములో మెత్తగా దాని పాద ములు పెట్టినట్లు తోఁచి దేహము పులకించెడిది. ప్రథమక్షణ మున, నిప్పుడు నట్లే తోఁచి పులకించిన దేహముతోఁ గన్ను లఱమోడ్చినాఁడు. కాని మఱుక్షణమున, నాతఁడు మనస్సు దిటవు చేసికొని, హృదయము నావేశించిన మార్దవము విద లించుకొనెను.

వాఘిరా యాతని భుజముపై వెనుకనుండి చేయి వేసినది. అది యాతనికిఁ జల్లగాఁ దోఁచి యొడలంతయు విద్యుత్తాడిత మైనట్లు వివశ మొనర్చినది. ఇఁక నది తన్ను యుద్ధప్రయత్నము చాలింపు మని కోరును. దానియెదుటఁ బడి, యది తన కన్ను లతోఁ దనవంకఁ జూచుచు నర్థించినచో, దానికిఁ దాను దాసానుదాసుఁ డగును. తన స్వామి కార్యమున కది విఘా

తము కావించును. ఇఁక నాలసించిన లాభము లేదు. ఒక్క క్షణ మాత్ర మాతఁడు మనసు దిటవు చేసికొని, కన్నులను జెవులను నిగ్రహించుకొని, వాఘిరా సుకుమార మగు హస్తమును తన కఠిన హస్తముతోఁ గట్టిగాఁ బట్టుకొని, తన సేవకున కప్పగించి, తాను తిరిగి వచ్చువఱకు దానిని దృఢ ముగా బంధించియుంచు మని యాజ్ఞాపించి, గుడారమునుండి యొక్క పరుగున వెలువడి వచ్చెను.

అప్పటికే యతని వాహిని నర్మదానదిని దాట నారంభించినది.

# 23

చంద్రుఁ డస్తమించి మూఁడు గడియ లైనది. వెన్నెల పిమ్మటి చీఁకటి యవుటచే, మరింత చీఁకటిగాఁ దోఁచుచున్నది. ఆ చీఁకటి మాటున కొండప వాహిని నిశ్శబ్దముగా రేవానది దాటుచున్నది. ఆవల గుట్టపై రాణి వినోదములతోఁ గాలక్షేప మొనర్చుచునే యున్నది.

వాహిని యంతయు నదిని తరించినది. రాణి పరివారము తమ రాక గమనించినట్లు లేదు. తన యదృష్ట మీ నాఁటికిఁ బండిన దనుకొనుచు, కొండప తన గణపతుల ముప్పురను, తమతమ గణములతోఁ మూఁడు వైపులనుండి యా గుట్టను క్రమ్ముకొని శీఘ్రగతి నధిరోహింప నాజ్ఞాపించి, యెదుటి వైపునుండి తన బలముతోఁ నెక్కిపోవుచుండెను.

ఏమో కాని, వా రెంతసేపటు లధిరోహించినను, రాణి పరివారము దూరముననే యున్నట్లున్నది.

కొంతదూర మతఁ డట్లుపోయి, యక్కడ వృక్షములకును, శిలలకును, బొదలకును, బిగించి లతలు పాశములు వలలు వలలుగా నడ్డము కట్టఁబడి యున్నట్లు గమనించెను. వెంటనే నిర్భయముగాఁ దన ఖడ్గముతో నవి ఛేదించుచు సాగుచు, భటులను గూడ నట్లే చేయ నాజ్ఞాపించెను.

మును పెన్నియో మాఱులు తా నంతఃపురములో విని యుండిన ఘంటానాద మొకటి, శ్రావ్యముగా గిరి శిఖరము నుండి వినవచ్చినది. రాణి శిబిరమును దఱియుచున్నా నను నానందముతో, కొండప ముందుకు దుముకుచునే యక్కడ నున్న వల్రతాళ్ళలో గట్టిగాఁ జిక్కుకొనెను. ఆతఁ డెంత ప్రయత్నించినను గాలుచేతు లాడలేదు.

అప్పుడే స్వయముగా సత్యాశ్రయపులకేశివల్లభులు నడిపించుచున్న వాహిని కొండప వాహిని నాకస్మికముగాఁ దాఁకి పరాభూత మొనర్చెను. కొండప వాహినిలోని భటులలోఁ బ్రాణములు పోయినవారు పోఁగా తక్కుఁగల వా రందఱు పట్టువడిరి.

పులకేశివల్లభుని విజయ మంతటితో నాగలేదు. మహారాజు తమ్ముఁడు సర్వసిద్ధి బిరుదాంచితుఁ డగు కుబ్జవిష్ణువర్ధనుఁ డా రాత్రియే, మూఁ డనీకినుల నచటికి దిగువను నర్మదానది దాఁటించెను. తెల్లవాఱుసరి కా సేన హర్షవర్ధనుని సేనల వెనుక భాగమున నున్న యాహారసంభారము లన్నిటిని

స్వాయత్త మొనర్చుకొని, వెనుకనుండియే యా సేనలఁ దాఁకుచుండెను.

ప్రొద్దెక్కుచున్నది. తమ యాహారపదార్థములు శత్రుహస్తగతమైన వను దిగులుతో, నెట్లైన నవి తిరిగి సంపాదింపవలె నను దీక్షతో, శ్రీహర్షవర్ధనుని సేనలు తలపడెను. ఏమి లాభము? అప్పటికే వారి యాహారపదార్థములు నర్మదానది దాటి దక్షిణతీరము చేరుచుండెను.

మధ్యాహ్నమైనది. నర్మదానది యెగువభాగముననుండి మఱికొన్ని యనీకినుల దాటించి, శ్రీసత్యాశ్రయపులకేశి వల్లభుఁడు శ్రీ హర్షునిసేనల రెండవవైపునఁ దాఁకెను. ఆ రెండుసేనల మధ్య శ్రీ హర్షుని సేన లడకత్తెరలోఁ జిక్కుకొన్న ట్లయినది.

ఆనాఁటి మహాయుద్ధము భయంకరముగా జరిగినది. ఇఱుపక్షముల వీరు లెందఱో మడిసిరి. శ్రీహర్షవర్ధనశీలాదిత్యుఁడు పరాజయ మంగీకరించి, పరమేశ్వరునిఁగా శ్రీ సత్యాశ్రయపులకేశివల్లభుల నంగీకరించి, నష్టపరిహార మచ్చుకొని, యుద్ధమునుండి కొలఁది మర్యాదతోఁ దప్పుకొనెను.

## 24

వాఘీరా, కొండపభటునిచే బంధింపఁబడిన రాత్రియే, అపర రాత్రివేళ కొండప శిబిరము నాక్రమించిన కుబ్జవిష్ణువర్ధనుని

భటులకుఁ జిక్కినది. ఆ పిమ్మట రెండు దినములకు, విజయోత్సవములు తిలకించుచు పట్టమహిషి శిబిరమున నుండి యానందించుచున్న పులకేశివల్లభుని యెదుట, రాజభటులు వాఘీరాను నిలిపి, యది దొరకిన విధము సవిస్తరముగా నివేదించిరి. ఆవల నా పటకుటీరముననే కొండప బంధితుఁడై యుండెను.

అంతఃపురకుబ్జ మహారాజుల కిట్లు నివేదించినది: "మహాప్రభూ, తమరును దొరసానిగారును దీనిపైఁ జూపిన యనుగ్రహము, పామునకు క్షీరము వలెనే, విషముగాఁ బరిణమించినది. ఇప్పుడు శత్రువాహినీపతి యైన కొండప కిది మహారాజ్ఞి యునికిని గూర్చిన వార్త లంపుచుండ నే నెన్నోమాఱు లుపలక్షించితిని. ఆ రాత్రి వినోద గోష్ఠిలో నున్న దొరసానిని బట్టుకొనుట కిదే యదనని వార్త చేర్చుటకే తన కాముక మిత్రుని శిబిరము చేరినది."

భగవానుని ప్రసాదము నిర్దోషురాలని కొండప యావల నఱచుచుండెను. వాఘీరా విభ్రాంతి నొంది, కన్నీరు ప్రవాహము కట్టుచుండ నోట మాటరాక, పులకేశి పాదములపై దీనముగా వ్రాలెను.

పులకేశివల్లభుఁ డాగ్రహావేశముతో 'ద్రోహీ!' యని యఱచుచు దానిని నఱకుటకు ఖడ్గ మొఱనుండి దూసెను. సమీపమున నున్న మహారాజ్ఞి తత్తరముతో, "మహాప్రభూ, స్త్రీహత్యకు స్వహస్తములతోఁ బాల్పడెదరా!" యనుచు వారించినది. వెంటనే మహారాజు కోపము నిగ్రహించుకొని, నఱకుట కెత్తిన కత్తి నెత్తినట్లే నిలిపివేసెను.

రాణి యంతటఁ జిఱునవ్వు నవ్వుచు, నావల బంధములో గింజుకొనుచున్న కొండపను జూపి, "మహాప్రభూ, రాణిని బంధింప ననేక పర్యాయములు యత్నించిన మీ చిత్రకారుని నెట్లు శిక్షింతురో మఱి?" యని యడిగెను.

అప్పటికి మహారాజు శాంతుఁడై యిట్లనెను: "చేఁజిక్కిన శత్రువీరునికి శిక్ష విధించు నాచారము మాకు లేదు. ఇతఁ డిప్పుడు శ్రీహర్ష వర్ధనుల వాహినీపతి. తన ప్రభుకార్యము నకై వీరోచితముగాఁ బోరిన యీతని సగౌరవముగా విడిచి పుత్తుము. మఱి యంతఃపుర ద్రోహ మొనర్చిన దీని కేమి శిక్ష తగును?"

రాణి: యుద్ధమున వెన్ను చూపిన పందనువలె, దీనికి శిరోముండన మొనర్చి సంఘారామమునకు గాడిదపైఁ బంపిన నెట్లుండును ?

మహారాజు: అది పూజ్యురాండ్రగు బౌద్ధభిక్షుణుల నవ మానించిన ట్లగును. 'ద్రోహి' యని దీని ముఖమున తప్తముద్ర వేసి, సంఘారామమునకుఁ జేర్చుట యుక్త మనుకొందుము.

రాణి యందుల కంగీకరించినది.

# 25

వాఘిరాకు నోట మాట రాలేదు. తాను నిర్దోషినని చెప్పి కొనుటకుఁ గూడ నది యిచ్చగింపలేదు. చెప్పినను నమ్మరు.

తన్ను శిక్షించుటలో రాజదంపతుల దోషములేదు. తాను చేసిన దోషమును లేదు. భగవానుని ప్రసాద మని మన్నన గాంచిన తన కీ గతి పట్టినది. తన పరాభవము ముద్రితమైన వికృతముఖముతోఁ బూజ్యుఁ డగు కుమారశ్రీనాథునిఁ దా నెట్లు దర్శింపఁ గలదు? సంఘారామములో నెవ్వరి మొగ మైనఁ జూచు టెట్లు ?

రాజభటులు వాఘిరాను సంఘారామ పర్వతము చేర్చు నప్పటికి రాత్రి ప్రొద్దుపోయినది. వెంటనే భగవానుని ప్రసాదము వాఘిరానది సాతుక్కుండిలోనికి దూకు నున్నతశిల నధిరోహించి, యందుండి యా జలపాతముతోఁ గలిసి దుమికి నిర్జీవముగాఁ బడిపోయినది. తెల్లవాఱు నప్పటికి, దాని శవము ప్రవాహ వేగమునకుఁ గొట్టుకొనిపోయి, వాఘిరానది సరోవర రూపమున శాంతముగా నుండుచో నొకశిలకుఁ బట్టినది.

ఆ యుదయమే వాఘిరా శవము వాఘిరానదిలో నున్న దని పరిచారకులు కుమారశ్రీనాథునికి విన్నవించిరి. మఱి కొంత సేపటికి కొండప వచ్చి, మహారాజ సన్నిధిలో నన్యాయముగా వాఘిరాకు జరిగిన పరాభవము కోపావేశముతో వివరించి, వాఘిరా యెక్కడ నున్నదని యడిగెను.

"వత్సా, ఇప్పుడు వాఘిరా మానావమానముల కతీత మైన స్థితిలో నున్న దెఱుఁగవా?" అనుచున్న కుమారశ్రీ మాటలు వినిపించుకొనక భగవానుని ప్రసాదము తన కిచ్చిన యాజ్ఞ శిరసావహింపక, వాఘిరాకును దనకు నెట్లు పరాభవము తెచ్చికొన్నదియు, కొండప గొడవగా వివరింప సాగెను.

"వత్సా, వాఘిరా భగవానుని ప్రసాదము. అది ద్రోహము చేయలేదని ఋజువు చేయుటకు నీ సాక్ష్యము నా కక్కఱలేదు. సరిగా విచారింపక యన్యాయముగా భగవానుని ప్రసాదమును శిక్షించిన మహారాజులకు రాణికి శుభముకాదే, పాపము! అయ్యో! మన ప్రమాదముచే భగవత్ప్రసాదము మన సంఘారామమును గూడఁ బరిత్యజించినది. భగవానుని యిచ్ఛ! వాఘిరా యిప్పుడు మానావమానముల కతీతురాలై, భగవానుని సన్నిధిఁ జేరికొన్నది. వాఘిరానదిలో దాని శరీరము చూడవచ్చును."

కొండప విలపించుచుఁ బరుగునఁ బోయి, వాఘిరా శవము చూచి రోదన మొనర్చెను. అది మొదట పసిపిల్లగా దొఱకిన మూడవనాఁ డిక్కడనే తాను చూచిన శవము నాకార మిట్లే సరిగా నున్నదని స్ఫురించి, కొండప పోయి తాను చిత్రించిన ప్రథమ చిత్రపటము తీసి, సంభ్రమాశ్చర్యములతో దానిని కుమారశ్రీనాథునకుఁ జూపించెను.

అప్పటికే, కుమారశ్రీనాథుఁడు వాఘిరా దొఱకిననాఁడు పొత్తులలో నున్న రత్నాంగుళీయకము భూర్జపత్రము భద్రపఱచిన స్థానమునుండి తీసెను. ఆ పత్రములో ముత్యాలకోవ వంటి యక్షరములతో నిట్లు వ్రాసి యుండెను.

"శ్రీకుమారశ్రీనాథులకు పాదదాసి మనవి. నన్ను వివాహమాడిన భర్తను మీయూదేశ ప్రకారము పతివ్రతనై సేవించితిని. వారు గతించిరి. ఈ బిడ్డ నాగర్భములో లేకున్న సహగమనము చేసి యుందును. ఇప్పు డీ బిడ్డను మీ సంఘా

రామమునకుఁ గానుకగా నర్పించుకొనుచున్నాను. మాకున్న యశేషధనము నీ పిల్లకు రాఁబట్టుట కీ రత్నాంగుళీయకము నిదర్శనము. మీ పాదదాసి."

కొండప చూపిన చిత్రము చూడఁగనే కుమారశ్రీ యది వాఘిరా తల్లి రూప మని గుర్తించెను.

"వాఘిరా నిర్దోషురాలై, దాని జననివలెనే వాఘిరా గర్భములో లీనమైనది. నీవు చిత్రించినది వాఘిరా తల్లి రూపమే!"

కుమారశ్రీనాథుని యాజ్ఞచే, వాఘిరానదీగర్భములో వాఘిరా దేహము సమాధిచేసిరి. కొండప దానిపైని చైత్యాకారముగా చిన్న శిల తొలిచెను.

మఱికొలఁది కాలమునకే మహేంద్రవర్మ కుమారుఁడు నరసింహవర్మ పల్లవరాజై, వాతాపి నగరముపై దండెత్తి వచ్చెను. యుద్ధఫలితములు దైవాధీనములు. ఆ రణభూమిలో పులకేశివల్లభుఁడు వీరస్వర్గ మలంకరింపఁ బట్టమహిషి సహగమన మొనర్చినది. నరసింహవర్మ సేనలు వాతాపి తగులఁ బెట్టినవి.

కుంతలరాజ్య మెల్లెడ నల్లరులు చెలరేఁగెను. సంఘారామమునకుఁ జెందిన గ్రామములనుండి రాఁబడి కట్టువడెను. సౌకర్యములు లోపించుటచే సంఘజిత్తు మొదలుగా భిక్షువు లెల్లరు నజంతా వదలి, యెవరి దారి వారు చూచుకొనిరి. కుమారశ్రీ మాత్ర మా ప్రదేశము వదలలేదు.

అశోకుఁడు ధారణీమాయి కాలధర్మ మొందిరి. ఆఁడు పడుచు అత్తవారింటె కరిగినది. సోదరు లందఱు నన్ని

దారులు పట్టఁగా, కొండప యొక్కఁడు కుమారశ్రీనాథుని కుపచర్య లొనర్చుచు నందే నిలిచి పోయెను.

# 26

ఒకనాఁ డాకస్మికముగా కొండపకుఁ దన జీవితము సార్థకము చేసికొనవలె నని యుత్కంఠ యావేశించినది. తాను వాతాపి లోఁ జిత్రించిన చిత్రములు వాతాపితోఁబాటు దగ్ధమయ్యె నని యతనికిఁ దెలిసినది. ఈమాఱు తన చిత్రములు దగ్ధము కాకుండ శాశ్వతముగా నిలుప నిశ్చయించితి నని యతఁడు కుమారశ్రీనాథులకు విన్నవించెను. కుమారశ్రీ జాలితో, "వత్సా, జగత్తులో శాశ్వతమైనది ధర్మ మొక్కటే. తక్కిన దంతయు క్షణికము, అనిత్యము !" అనెను.

"దేవా, ఈ వాఘిరానది శాశ్వతము కాదా ? అచింత్య మగు నీ అజంతాగిరి శాశ్వతము కాదా ?" అని కొండప ప్రశ్నింపఁగా, కుమారశ్రీ మఱింత జాలితోఁ జూచెను.

ఆ నాఁడే కొండప, తన తండ్రి యశోకుఁడు తొలిచి యలంకరించిన గుహారామమునకుఁ బడమరగా నింకొక గుహారామము తొలువ నారంభించెను. సరిగా ఆ ప్రదేశమున కెదురుగనే వాఘిరా శవము దొఱకినది. ఆ కొండను బ్రద్దలు చేయుచున్న కొలఁదియు నాతని హృదయభారము శాంతించు

చున్న ట్లుండెను. కొన్ని సంవత్సరముల కది తొలుచుట పూర్తి చేసి విగ్రహములు మలచి యాపైఁ జిత్రములతో దాని నలంకరింపఁ బూనుకొనెను.

ఆతఁ డందులో ముందు చిత్రించినది క్షమాభిక్ష వేఁడుచుఁ దనపాదములపై వ్రాలిన వాఘిరాను నఱకుటకు ఖడ్గమెత్తిన పులకేశి చిత్రమే! పులకేశిపైఁ దన కసి తీర్చుకొనుట కందులో పులకేశిని రాక్షసాకారముతో శిరోభాగము చిత్రింపక మొండెముగా వదలెను. పట్టపురాణిపైఁ గసిచే నామె చేతులు మాత్రము చిత్రించి వదలెను. రాజు వెనుకనే కుబ్జ వికృత రూపము ప్రదర్శించెను. తాను చిత్రించిన యా వాఘిరాదీనాకారము చూచుకొనుచు నతఁ డెంతో కాలము విలపించుచుండెను.

ఆ తరువాత నాతఁ డందులోఁ జిత్రించినది సర్వాంగ సుందరమగు వాఘిరా చిత్రమే. అది యొక స్తంభము నానుకొని నిలుచుండి, యెడమకాలు వెనుక స్తంభమున కానించి, యెడమచేతిలో నొక రత్నము పరీక్షించు చున్నట్లు చిత్రించినాఁడు. ఆ రూప మాతఁడు చిత్రించి, ముగ్ధుఁడై దానినే చూచుచు బహుకాలము చిత్రరచన చాలించెను.

కుమారశ్రీనాథుఁ డది గమనించి యొకనాఁ డాతనిఁ బిలిచి, "వత్సా, బుద్ధప్రసాదమును కామనతోఁ జూచుచుండిన నీకు శాంతిచేకూరదోయి !" అని యుపదేశించెను.

కొండప తానే సర్వవిధముల భగవానుని ప్రసాదమున కపరాధము కావించితి నని తన్నుఁదా నిందించుకొనుచు, బాధ

శాంతించుటకై, యాతఁడు క్షాంతివాద జాతకము చిత్రింప నారంభించెను. బోధిసత్త్వుఁడు బ్రహ్మర్షిగా జన్మించి క్షాంతి సాధన గావించెను. ముండ్ల కట్టితో దేహము మోదినను, కాలుసేతులు కోసినను, ముక్కుఁ జెవులు చెక్కినను, ఆతఁడు క్షాంతి ప్రతిజ్ఞ విడువ లేదు.

దాని తరువాత, బోధిసత్త్వుఁడు బంగారు హంసగాఁ బుట్టి కాశీ రాజదంపతులకు ధర్మబోధ యొనర్చుట ధ్యానించుచుఁ నతఁడు హంస జాతకము చిత్రించెను.

ఆ పిమ్మట కొండపకు గౌతమబుద్ధుని జీవిత విశేషములు చిత్రింపఁ గుతూహల ముదయించి, మాయాదేవి స్వప్నము, లుంబినీవనగమనము, తుషితస్వర్గములోఁ జేసిన జన్మనిశ్చయము, గౌతమజననము, మహాత్యాగము, విశ్వరూప సందర్శనము-ఇత్యాది చిత్రములు చిత్రించెను. అవి చిత్రించుచున్న కొలదియు, నాతనికి భగవానుని లీలలు ప్రత్యక్షము లగుచుండెను.

కొండప యట్లా గుహారామములోఁ జిత్రించిన చిత్రము లెన్నియో కలవు. రురు జాతకము, విధుర పండితజాతకము, పూర్ణావదానము, కుక్కుటోపదేశము, మఱియు నెన్నియో చిత్రించెను. ఏది చిత్రించినను దాని భావములోఁ దన మనస్సు లగ్నమొనర్చి, యాతఁడు చిత్రరచనతోఁ బాటు ధర్మసాధన కూడఁ జేయుచుండెను.

కొండప యాగుహాలయము నలంకరించుచునే, యొకనాఁటి సాయంకాలమున, స్నానఘట్టమునకు కాళ్ళు పడకుచున్న

కుమారశ్రీనాథుని స్నానార్థము తీసికొని పోయెను. వారు స్నానము చేయుచుండఁగనే పెద్దపెట్టున వర్షము కురిసి వాఘిరానది పొంగినది. అజంతాపర్వతము పైనుండి గుహా రామముల పైకప్పుల మీదుగా జలపాతములు వాఘిరానది లోనికి దూకినవి. ఆ వేగమున కాఁగలేక వారిరువురి దేహ ములు వాఘిరానదీ గర్భములో లీనమై వాఘిరా చైత్యశిల చేరికొన్నవి.

వారి దేహములకు ఖనన సంస్కారము చేయుటకైన నప్పు డెవరును సంఘారామములో లేరు. వాఘిరా గర్భము లని మత్స్యములే వారి దేహముల కంత్యసంస్కారము ల నర్చినవి.

వాఘిరానది నేటికిని పెద్దపులివలెనే, అజంతా గిరినుండి గంతులు వేయుచుఁ బ్రవహించుచున్నది. ఆ కొండయు నది పేయు గంతులనాదరముతో భరించుచుఁ, బ్రేమాతిశయముతో దాని కోతల నోర్చుకొనుచు, దాని నొడిలో ధరించి నిశ్చల ముగా నిలిచి యున్నది.

రాత్రుల నేకాంతముగా నచ్చట గడపినవారికి వాఘిరా విషాదకథను వాఘిరానది పాడుచుండఁగా, నాకొండ నిట్టూ ర్పులు విడుచుట స్పష్టముగా నిప్పటికిని వినిపించుచుండును.



